వేమన యోగి

# వర్ణ వ్యవస్థ



వ్యాఖ్యాత

డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధర స్వామి

# వేమన యోగి - వర్ణ వ్యవస్థ

వ్యాఖ్యాత

**శ్రీ బ్రహ్మానంద శ్రీధరస్వామి**

ఓం
శ్రీసద్గురవే
నమః

ప్రచురణ

**శ్రీ శివరామదీక్షితీయ అచల పరిపూర్ణ గురూపపీఠ రాజయోగాశ్రమం**

మండల కేంద్రము : బచ్చన్నపేట - 506221

జిల్లా : వరంగల్, ఆంధ్రప్రదేశ్

ఫోన్ : 08710 - 54262

# వేమన యోగి

# వర్ణ వ్యవస్థ

వ్యాఖ్యాత

**డా॥ శ్రీ బ్రహ్మానంద శ్రీధరస్వామి**

M.A. (Philosophy), M.Sc (Physics), Ph.D (Philosophy)

ప్రథమ ప్రచురణ.....క్రీ.శ. ఆగష్టు, 2002....ప్రతులు.......1000.

**ప్రతులకు**

శ్రీమతి పొన్నాల అనసూయాంబగారు, ఇంటి నెం. 4-1-96, రాజయోగాశ్రమం, పాతబోయిగూడ, సికింద్రాబాదు-500 008.

శ్రీ బోధానంద రాపెల్లి రామచంద్ర రాజయోగి,
ఉపకార్యదర్శి, రాజయోగాశ్రమం, బచ్చన్నపేట - 506221,
జిల్లా : వరంగల్లు, ఫోన్ : 08710-54262

విశాలాంధ్ర బుక్ హౌస్, (అన్ని బ్రాంచీలు)
4-2-237, విజ్ఞాన్ భవన్, సుల్తాన్ బజార్,
హైదరాబాదు - 500 195.

Cover Designing & Printing at
Manasa Graphics, 98493 59445


వెల:రూ॥ 25/-

## అంకితం

కుల మత వర్ణాది భేదాలతో
కుంచించుకు పోయిన
కుమతుల హృదయాల
కుళ్లు కడిగి
కళ్లు తెరిపించుచున్న

మద్గురువరేణ్యులు

అచలర్షి

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య
రాజయోగీశ్వరుల పాద పద్మములకు
ఈ గ్రంథం అంకితం చేయబడినది.

## అభినందన

చిరంజీవి శ్రీ బ్రహ్మానంద శ్రీధరస్వామి రచించి, ప్రకటించుచున్న ఈ "వేమనయోజీ-వర్ణవ్యవస్థ" అను గ్రంథము సర్వజనులకు వర్ణవ్యవస్థ యొక్క నిజస్వరూపాన్ని తెలియజేసి, వారి బుద్ధిని వికాసము చేయుననుటలో అతిశయోక్తి లేదు. చిరంజీవి వ్యాఖ్యానము తాత్త్విక వివేచనతో కూడుకొని ధారాశుద్ధితో ఒప్పుచున్నది. ఇది అగ్రవర్ణాల వారమనుకొనువారికి కనువిప్పు కలిగించగలదు. అంతేగాక నీచ వర్ణాలవారి మనోస్థైర్యాన్ని పెంచగలదు. వేమన యోగి రమ్యముగా చెప్పిన పద్యరత్నాలు వర్ణవ్యవస్థకు చక్కటి పరమార్థాన్ని బోధించాయి. దానినే ఈ గ్రంథంలో చక్కగా విప్పి చెప్పిన చిరంజీవి శ్రీ బ్రహ్మానంద శ్రీధరస్వామి సదా శ్రీవారి కృపకు పాత్రుడు కావలెనని ఆశిస్తూ, హృదయ పూర్వకముగా అభినందించుచున్నాను.

ఇట్లు

శ్రీ సదానంద శ్రీహరి రాజయోగి

రాజయోగాశ్రమం,
అయ్యప్ప దేవాలయపు వీధి,
విద్యానగర్ కాలని, బాణాపురము,
జనగామ-506167
జిల్లా॥ వరంగల్లు
ఫోన్ : 08716-2365
ది. 19.08.2002

### శ్రీ శివరామదీక్షిత అచల పరిపూర్ణ గురు పీఠాధిపతి



శ్రీ దయానంద పొన్నాల రాజయోగీశ్వరులు
(క్రీ.శ. 1899 - 1985)

శ్రీ శివరామదీక్షిత అచల పరిపూర్ణ గురూపపీఠ

రాజయోగాశ్రమ కార్యదర్శి



శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి

బచ్చన్నపేట

శ్రీ శివరామదీక్షిత అచల పరిపూర్ణ గురూపపీఠ

రాజయోగాశ్రమ ఉపకార్యదర్శి



శ్రీ శకుంతలాదేవి సమేత

శ్రీ బోధానంద రాపెల్లి రామచంద్ర రాజయోగి

బచ్చన్నపేట

# తత్త్వము

రచన॥ శ్రీ నిర్భయానంద తాళ్ళూరి నరసింహారావు రాజయోగి,
గుంటూరు

పల్లవి॥ అన్ని బోధల కన్నా మిన్నా - అచల ఋషుల బోధేనన్నా
అచల ఋషుల బోధను విన్నా - అంతు నీకు దొరుకునన్నా ॥అన్ని॥

1) వివిధ విద్యలన్నిటి కన్నా - బ్రహ్మవిద్య గొప్పదిరన్నా
బ్రహ్మవిద్యలన్నిటి కన్నా - వార్తికాంతము గొప్పదిరన్నా
వార్తికాంతము కన్నా యికను - అచల బోధ గొప్పదిరన్నా
అచల బోధను తెలుసుకున్నా - సచలము మది వీడునన్నా ॥అన్ని॥

2) మతములన్నింటికన్నా - సత్యమైనది ఈ బోధన్నా
యోగములన్నింటి కన్నా - రాజయోగమే గొప్పదిరన్నా
నాల్గు వేదంబులకన్నా - ఉపనిషత్తులు గొప్పవిరన్నా
ఉపనిషత్తుల కన్నా మిన్నా - అచల బోధ విన్నా కన్నా ॥అన్ని॥

3) సాంఖ్యయోగము నేర్చితెనన్నా - సృష్టి వివరము తెలియునన్న
తానెవరో తెలుసుకున్నా - తనకు మూలము లేదురన్నా
వెతకి వెతకి పడుట కన్నా - అచల గురుని చేరుమన్నా
మంత్రయుగమును తెలుసుకున్న - మళ్ళీ జన్మము లేదురన్న ॥అన్ని॥

4) పరంపరగా వచ్చినదన్నా - పరిపూర్ణమును జూపునన్నా
సికింద్రాపురమున వున్న - దీక్షితాచల పీఠమునన్నా
ధరణి భక్తుల నేలుచున్న - దయానంద ప్రభువరుడన్నా
శ్రీమించు బోధనన్నా - సుజనులకెగ జల్లెనన్నా ॥అన్ని॥

5) అచల గురుని సన్నిధి వున్నా - ఆది అంత్యము తెలియునన్నా
సంగయార్య సద్గురుడన్నా - సంశయంబు దీర్చెనన్నా
తాళ్ళూరి నర్సింహుడన్నా - తానె లేక పోయెనన్నా
ఈ సత్య బోధ విన్నా - మీ జన్మ ధన్యమన్నా ॥అన్ని॥


**DR. R. Venkat Reddy,**
Department of Philosophy,
University of Asmara,
ASMARA,
ERITRIA, N.E. AFRICA.


*I have read the book entitled "Vemana Yogi- Varna Vyavastha" which is written by Dr. Brahmananda Sreedhara Swami. The book is very much useful to understand the real philosophical meaning of caste system (Varna Vyavastha). The commentary is based on Achala Siddhantha. The lanaguage used in this is lucid. I suggest to everyone to read this book to understand the essence of the Varna Vyavastha.*

Dt. 21.8.2002 ***(Dr. R. Venkat Reddy)***

# పీఠిక

(భారతదేశంలోకి ఆర్యులు రాక ముందు ఒకే వర్గముగా వుండిరి. అప్పుడు వర్ణములు లేవు. కాని ఈ వర్ణ వ్యవస్థ గూర్చి) మొదటిసారిగా మనకు ఋగ్వేదీయ పురుష సూక్తమునందు చెప్పబడినది. దీనిని అనుసరించి ఆర్య సమాజములోని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు నాలుగును క్రమముగా విరాట్ పురుషునికి ముఖము, బాహువులు, తొడలు, పాదాలుగా వర్ణించబడినాయి. సృష్టిలోని మానవులందరిని ఏకైక పురుషునిగా వర్ణించినచో ఆ పురుషునికి మానవులలోని మేధావంతులే ముఖము, శారీరక బలము గలవారే బాహువులు, వ్యాపార వ్యవహారము నడిపే వారే తొడలు, సేవకులుగా వుండే వారే పాదాలుగా వున్నాయని విమర్శించిన తెలియబడును. కనుక ఇది వేద సమ్మతమే మరియు తార్కికంగా కూడా సత్యమే. మొదట ఆర్యులందరు ఒకే వర్గముగా వుండిననూ, తర్వాత క్రమేపి నాలుగు వర్ణాలు ఏ విధంగా ఏర్పడినవి అనగా - ఆనాడు సమాజమునకు అవసరమగు నిత్యావసర వస్తువులగు ఆహార ధాన్యాలను, వస్త్రాదులను మొదలగునవి తయారు చేయుటకు సరియైన వ్యవస్థ లేకుండెను. శాశ్వతావసరములగు గృహారామక్షేత్రాదులను నిర్మాణము చేయుటకు నైపుణ్యము కలిగిన వ్యక్తులు లేకుండిరి. ఎవరెవరికి ఏ యే రంగాలలో శ్రద్ధ వున్నదో, వారు ఆ యా రంగాలకు పరిమితమై వాటి యందు సంపూర్ణ నైపుణ్యతను సంపాదించుట యందు నిమగ్నులై వుండిరి. అంతియే గాక వారికి పుట్టిన సంతానమునకు కూడా చిన్న తనము నుండియే ఆ యా వృత్తులయందు శిక్షణను ఇచ్చుచుండుటచే వారు యవ్వనదశకు చేరుకొనే వరకే నిపుణులుగా తయారు చేయబడుచుండిరి. వారి సేవలు ఎంతగానో సమాజమునకు ఉపయోగపడుచుండెడివి. ఒక వృత్తియందు స్థిరపడినవాడు, ఆ వృత్తియందు నిపుణతగల స్త్రీని లేదా ఆ వృత్తి చేయు కుటుంబంలో పుట్టిన స్త్రీని మాత్రమే వివాహము చేసుకొనెడివారు. అందువల్ల వచ్చే వధువు కూడా అతడి వృత్తిలో సహాయ పడుటయేగాక, ఆ కుటుంబ పరిస్థితులకు అనుకూలంగా వుండుటయేనని స్పష్టమగుచున్నది. అందువల్ల అభివృద్ధి వేగవంతముగా జరుగ వీలుండెడిది.

కాని ఆనాడు తక్కువ వర్ణములలోని వారు యోగ్యతను ప్రదర్శించినచో ఎక్కువ వర్ణములలోనికి తీసుకొనెడివారు. ఛాందోగ్యోపనిషత్తు ఆధారంగా - దాసీపుత్రుడగు జాబాల సత్యకాముడు తనకు తండ్రి పేరు, గోత్రం పేరు తెలియదని, గురువు గౌతముడి అడిగిన ప్రశ్నకు సత్యమైన సమాధానం ఇవ్వడంచే, సత్యకాముడిని సత్యవాక్కు పలుకుటచే బ్రాహ్మణునిగ గుర్తించి ఉపనయనం చేసి గౌతముడు బ్రహ్మవిద్య బోధించాడు. కనుక జన్మతః వచ్చే కులగోత్రాల కన్నా అతడి సుగుణ సంపన్నాలే ముఖ్యమని వ్యక్తమవుతుంది. కనుక నాడు వర్ణమును నిర్ణయించునది శీలము(Character) కాని, జన్మకాదని తెలయబడుచున్నది.

ఎవరైతే బ్రహ్మజ్ఞానమునందు ఆసక్తి, శ్రద్ధ కలవారు వున్నారో వారు సద్గురువును చేరుకొని బ్రహ్మతత్త్వమును తెలిసికొని, దాని యందు వర్తించుచున్నారో, వారే బ్రాహ్మణులు. దేశ రక్షణకు పూనుకొని దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ యందు కర్తవ్యమును ఎవరైతే నిర్వహించుచున్నారో, వారే క్షత్రియులు. సమాజానికి కావలసిన వస్తువులను చేకూర్చే వారు, ఆహార ధాన్యాదులను పండించే వారు వైశ్యులు. ఇక వీరందరికి సహాయ పడుచు జీతగాని వలె నుండు వారలే శూద్రులు. ఈ నాలుగు వర్ణముల వారు భారతదేశమునందేగాక సర్వ ప్రపంచము నందు కనిపించుదురు. కాని భారత దేశమునందు ఈ వర్ణవ్యవస్థ కులాల రూపములో నేటికినీ కొనసాగుచున్నది. ఇతర దేశాలలో కులాల ప్రసక్తి లేదు. కాని మత పిచ్చి కొనసాగుచున్నది. ఇతర దేశాలలో ఎవరిని ఎవరైనను సమ్మతితో వివాహమాడవచ్చును. కాని మనదేశంలో వర్ణమనేది గుణకర్మల సిద్ధాంతం నుండి వక్రీకరించబడి 'వృత్తి'తో కొన్నాళ్ళు గుర్తించబడి, ఆ తర్వాత తల్లిదండ్రుల జాతిని బట్టి వ్యక్తి యొక్క కులాన్ని నిర్ణయించుచున్నారు. దీనికి కారణం కులవృత్తులు క్రమేపి నశించిపోవడం. ఇట్టి సమయంలో వర్ణవ్యవస్థ యొక్క ప్రాముఖ్యత ఏమిటి? అనునది ప్రధానమైన ప్రశ్న. ఇంకా ఎన్ని క్రొత్త కులాలుగాని, క్రొత్త మతాలుగాని వచ్చిననూ మానవుని యొక్క గుణకర్మలు పై నాలుగు రకాలుగానే సమాజానికి ఉపయోగపడతాయి తప్ప వేరే విధానము లేదు. కనుక ఇప్పటికినీ, ఎప్పటికినీ సమాజములో నాలుగు వర్ణాల వారు తప్పని సరిగా వుండి వుంటారు. ఒక్కరిలోను ఒకటి కంటె ఎక్కువ వర్ణ లక్షణాలు కూడా వుండవచ్చును.

ఏది ఏమైనను వర్ణవ్యవస్థ ప్రజల యొక్క రాజకీయ, సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక ప్రభావములను అదుపులో పెట్టి, జీవన సామరస్యమును ప్రజలకు అందించెననుట

నిర్వివాదాంశము. ఈ వర్ణవ్యవస్థ ధనమే గొప్పదను భావమును ప్రతిఘటించి, విజ్ఞాన వివేకముల ద్వారా సచ్ఛీలమును వృద్ధి చేయుటలో ప్రముఖ పాత్ర వహించి, ఇహలోకపు మానవ విలువలను పెంచునేగాని, మోక్షమును కల్గించలేదు.

వేమనయోగి కాలమునాటికి వర్ణాలు కులాలుగా మారినాయి. బ్రాహ్మణాది అగ్రకులాల వారు నీచ జాతులపై తమ స్వార్థం కోసం వివిధరకాల కట్టుబాట్లు పెట్టి తమ ఆధిపత్యాన్ని నిలుపుకొనుచున్నారు. వీరందరు వేదవేదాంత శాస్త్రాల సారాన్ని తెలియని వారే. ఒక వేళ వీరిలోని కొందరికి తెలిసిననూ, తమ జాతి వారి ఆధిపత్యమును తొలగించుటకు ఇష్టపడక పోవుట వల్ల, వారి దురాచారాలు కొనసాగుచూనే వుండెను. అట్టి సమయంలో వేదాంతసారాన్ని గ్రోలిన వేమనయోగి వీరి ఆగడాలను శాస్త్రోక్తముగా నిరసించు ప్రయత్నంలో ఊరూరా తిరుగుచూ తన ఆటవెలది పద్యాలను ఈటెలుగా చేసి వారిపై విసిరెను. ఆ క్రమములోనే కుల, మత, వర్ణాది వ్యవస్థలను తాత్త్వికంగా మరియు తార్కికంగా విమర్శిస్తూ, అందులోని లోపాలను లోకమునకు ఎత్తి చూపాడు. వేమన యోగి నాస్తికుడు కాదు. బౌద్ధ మతము వాడు అసలే కాదు. సర్వ మతాలకు అతీతమైన అచల సిద్ధాంతి వేమన. వేమన అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతమును బోధించెను. ఈ సిద్ధాంతానుసారమే వర్ణవ్యవస్థను గూర్చి వేమన యోగీంద్రుడు చెప్పిన పద్యాలపై వ్యాఖ్యాత చిరంజీవి శ్రీ బ్రహ్మానంద శ్రీధరస్వామి తాత్త్వికమైన, శాస్త్రీయమైన వ్యాఖ్యానాన్ని అందించాడు. వర్ణ వ్యవస్థ యొక్క అసలు రంగును తెలుసుకోవడానికి ఈ గ్రంథము తప్పక చదువ తగినదని నా అభిప్రాయము. వ్యాఖ్యాతకు నా శుభాశీస్సులు.

ఇట్లు
ఉపకార్యదర్శి
శ్రీ బోధానంద రాపెల్లి రామచంద్ర రాజయోగి

శ్రీ శివరామదీక్షితీయ
అచల పరిపూర్ణ గురూపపీఠ
రాజయోగాశ్రమం,
బచ్చన్నపేట, జిల్లా॥ వరంగల్లు
ది. 18-08-2002

## వేమనయోగి - వర్ణవ్యవస్థ

వర్ణ వ్యవస్థ ఎలా ఏర్పడినది? దాని అంతరార్థమేమిటి? అసలు వర్ణమనేది వంశ పరంపరమా? వర్ణ వ్యవస్థ వలన కలిగే ప్రయోజనాలు ఏమిటి? అనే ప్రశ్నలు సహజంగా మనలో ఉత్పన్నమవుతాయి. ఈ రకమైన ప్రశ్నలన్నింటికి సమాధానాలు ఇవ్వడం కోసమే ఈ గ్రంథము రచించబడుచున్నది.

వేమన యోగి వేదాంత వేద్యుడు. సర్వ శాస్త్ర సారములను సాధించిన సాధువు. ఆయన ఆంధ్రదేశంలోని అజ్ఞానాంధకారంలోనున్న జనావళికి జ్ఞానాన్ని బోధించి అచలాన్ని దర్శింపజేసిన అచలయోగి. ఆ యోగి వర్ణ వ్యవస్థను గూర్చి ఆమూలాగ్రముగ తన పద్యాలలో వివరించి యున్నాడు. అంతియే గాక కులమతాది వ్యవస్థల గూర్చియూ, వాటివల్ల కలిగే అవస్థల గూర్చియూ వర్ణించి వున్నాడు. ఆనాటికి, ఈనాటికి జరుగుచున్న విపరీత పోకడలను ఎండగట్టి వున్నాడు. అగ్రవర్ణాల వారు నీచ జాతులపై తమ ఆధిపత్యాన్ని నిలుపుకొనుటకు అనేక కట్టుబాట్లు ఏర్పాటు చేసి సంఘముపై బలవంతంగా రుద్దుచున్నారు. సాంప్రదాయ వాదులమని, అగ్రవర్ణాల వారమని చెప్పుకొనుచు వారు ఈ వర్ణ వ్యవస్థకు వక్ర గతిని ఆపాదించు చున్నారు. శాస్త్రి కొడుకు శాస్త్రియేనని డప్పు కొట్టుకొనుచు స్వప్రయోజనాల కోసం శాస్త్రీయ అర్థాన్ని తుంగలో తొక్కుచున్నారు. అట్టి వారి బోధలను నిరసించుచు, వర్ణవ్యవస్థ యొక్క అసలు రంగును బయట పెట్టడమే ఈ గ్రంథం యొక్క ప్రధానాశయం.

వర్ణం అనగా 'రంగు' అని అర్థం. ఇంకా సూక్ష్మంగా ఆలోచిస్తే రంగు అనేది గుణానికి ప్రతీక. తెలుపు స్వచ్ఛతకు, కాషాయం త్యాగానికి, ఆకుపచ్చ శాంతమునకు గురుతు. అలానే వర్ణ వ్యవస్థలో నాలుగు వర్ణాలున్నాయి. అవి 1. బ్రాహ్మణ, 2. క్షత్రియ, 3. వైశ్య, 4. శూద్ర. సమాజంలో వున్న మానవుల యొక్క గుణ గణాల్ని బట్టి వారిని పై నాలుగు వర్ణాలుగా విభజించవచ్చును. ఇవి వంశ పరంపరగా వచ్చేవి కావు. వ్యక్తి యొక్క గుణం మరియు కర్మను బట్టి అతడు పై నాలుగు వర్ణాలలో ఏదో ఒక వర్ణానికి చెందినవాడని నిర్ణయించవచ్చును. దీనికి ప్రమాణమేమిటనగా

శ్లో॥ చాతుర్ వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః ।
తస్య కర్తార మపిమాం విద్ధ్య కర్తారమవ్యయం॥

(భగవద్గీత)

అనగా "బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అనబడు ఈ నాలుగు వర్ణముల సముదాయము గుణకర్మల విభాగము ననుసరించి నా చేత రచించబడినది (ఏర్పరచబడినది)

ఈ విధమైన సృష్టి రచనకు కర్తను నేనేయైననూ ఈశ్వరుడనూ, నాశన రహితుడను అగు నన్ను నిజముగా అకర్తనుగా నీవు తెలుసుకొనుము".

కనుక మానవుని యొక్క గుణము మరియు అతడు ఆచరించు కర్మ (పని) ను బట్టి, అతడు ఏ వర్ణమునకు చెందినవాడో చెప్పాలి, కాని అతని తల్లి దండ్రుల యొక్క వర్ణాన్ని బట్టి కాదు. అందుకే

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మనా జాయతే ద్విజః ।
వేద పాఠంతు విప్రానాం బ్రహ్మ జ్ఞానంతు బ్రాహ్మణః ॥

అని చెప్పబడింది.

ఏ కులంలో పుట్టినప్పటికిని, పుట్టిన వారందరూ శూద్రులే. అందువల్లనే బ్రాహ్మణ కులంలో పుట్టిన పిల్లవాడయిననూ ఉపనయనము కాకపోతే అతడు శూద్రుడే. కనుకనే బ్రాహ్మణుల భోజన పంక్తిలో అతన్ని కూర్చోనివ్వరు. అతడే కర్మ ద్వారా యజ్ఞయాగాదులను చేసినప్పుడు 'ద్విజుడు' అని పిలువబడుతాడు. అతడే వేద పాఠములను నేర్చినప్పుడు 'విప్రుడు' అని పిలువబడుతాడు. అతడే బ్రహ్మజ్ఞానమును పొందినప్పుడు 'బ్రాహ్మణుడు' అవుతాడు. ఏ తల్లి దండ్రులకు పుట్టిన వాడయినప్పటికినీ, అతడు చేసే కర్మలననుసరించి ఆయా వర్ణాలకు చెందుతాడు గాని, వర్ణమనేది వంశ పరంపరాగతంగా సంక్రమించే ఆస్తి కాదు. అది వ్యక్తి తన గుణకర్మల ద్వారా సంపాదించుకునే ఒక అంతస్తు. తాను పొందిన అంతస్తును నిలబెట్టుకొనుటకు తను నడచుకొను విధానమే అతి ముఖ్యము. కాని ప్రవర్తన సరిగా లేనిచో ఆ అంతస్తు కుప్ప కూలి పోగలదు. అందువల్లనే వేమనయోగి ఇలా చెప్పుచున్నాడు.

ఆ.వె॥ **రామ నామ పఠనచే మహి వాల్మీకి**
**పరగ బోయ యయ్యు బాపడయ్యె**
**కులము ఘనము గాదు గుణము ఘనంబురా**
**విశ్వదాభిరామ వినుర వేమ॥** **1**

పశు పక్షాదులను వేటాడే బోయవాడైన వాల్మీకి రామనామమును పఠించుటచే బ్రాహ్మణునిగ ఖ్యాతి చెందెను. ఇచట 'రామ' అను శబ్దమునందలి 'రా' అను అక్షరము తత్ పదమగు బ్రహ్మమును, 'మ' అను అక్షరము త్వం పదమగు జీవుడిని సూచించును. ఈ రెంటి ఐక్య పద్ధతి తెలుసుకొని, ఆ బ్రహ్మతత్వమునందు చరించువాడే 'బ్రాహ్మణుడు' అని నిర్ణయము. కాని మనిషికి తాను పుట్టిన కులము వల్ల గొప్పతనము రాదు. మనిషిని మహా మనీషిగా రూపు దిద్దే గుణమే గొప్పదని వేమన ఇచట నుడువు చున్నాడు.



ఆ.వె॥ **జాతులందు మిగుల జాతియే దెక్కువో**
**యెరుక లేక తిరుగ నేమి ఫలమొ?**
**యెరుక గలుగువాడె హెచ్చైన కులజుండు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥** **2**

అష్టాదశ జాతులలో ఏ జాతి గొప్పదో తెలుసుకోకుండా ఎన్ని తీర్థ క్షేత్రాలు తిరిగిననూ ఫలితము లేదు. అనగా వాటి వల్ల జననమరణ బాధ తొలగదు. అలాగాకుండా, సద్గురువును చేరుకొని సృష్టి స్థితి లయాలకు కారణమైన అధిష్ఠాన చేతన బ్రహ్మమును (ఎరుకను) దాని యొక్క స్థాన, స్వరూప, స్వభావములను చక్కగా తెలిసికొనిన వాడే గొప్ప కులమువాడు అని వేమన వచించుచున్నాడు. కాని ఆ ఎరుక (బ్రహ్మ) తత్వమును తెలిసికోనివాడు ఈ నరక కూపమందుబడి అనేక నీచ జన్మలు పొందుచుంటాడని వేమన నిర్ణయం.

ఆ.వె॥ **కులము లేని వాడు కలిమిచే వెలయును**
**కలిమి లేని వాని కులము దిగును**
**కులము కన్న మిగుల కలిమి ప్రధానంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥** **3**

తక్కువ కులమువాడైననూ, అతని వద్ద డబ్బు వున్నచో గొప్పవాడని పొగడబడును. ఎక్కువ కులమువాడైననూ, అతడు దరిద్రుడైనచో, అతని కులము విలువ పడిపోవును. ఆతనికి సమాజములో గౌరవము లభించదు. కనుక కులముకన్న మానవునికి ధనమే ముఖ్యము. ఇది వ్యవహార సంబంధమైనది. ఇక పారమార్థికంగా ఆలోచిస్తే, కలిమి అనగా జ్ఞానము. ఆ జ్ఞానమే ధనము. జ్ఞానమనే సంపద వల్లనే మానవునికి 'ఇది గొప్పకులము, అది నీచకులము' అని వాదించే అజ్ఞాన దారిద్ర్యం తొలగి పోతుంది. కనుక మానవుడు బ్రహ్మ జ్ఞానమును పారమార్థిక అభివృద్ధి కొరకు మరియు డబ్బును ప్రాపంచిక సుఖాల కొరకు సంపాదించవలెనని వేమన బోధించుచున్నాడు.

ఆ.వె॥ **కులము గలుగువారు గోత్రంబు గలవారు**
**విద్య చేత విర్ర వీగువారు**
**పసిడి గల్గువాని బానిసె కొడుకులు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥** **4**

ఉత్తమ కులములో జన్మించినామనుకొనువారు, శ్రేష్ఠమైన గోత్రము గలవారమనుకొనువారు, ప్రాపంచిక విద్యా మదము చేత విర్రవీగువారు మొదలగువారందరు ఆత్మ

విద్య కలవాడి ముందు బానిసె కొడుకులు. ఎందుకనగా- 'పసిడి గల్గువాని' అనగా హిరణ్మయ కోశము (బంగారు తొడుగు) నందు ఆత్మైక్య భావము కలవాడు అని అర్థము. అట్టివాడు ఈశ్వర స్వరూపమును పొంది వుంటాడు. అట్టివానికి జీవులందరు దాసానుదాసులే కదా?. అందువల్ల పైన చెప్పబడినవారందరూ అజ్ఞాన దశల్లో వుండి భేదభావ బుద్ధి వున్న జీవులే కదా? ఒక్క ఈశ్వరుడే సమిష్ఠి భావమును పొంది ఉన్నాడు. అతడికి మిగతా వారందరూ దాసానుదాసులే అని చెప్పక తప్పదు.

ఇక లోక వ్యవహారములో ధనవంతుడికి ఎక్కువ కులమువారైననూ, ఎక్కువ గోత్రము కలవారైననూ, లేక సకల విద్యలయందు నిపుణత కలవారైననూ దాసానుదాసులై వుండి డబ్బును సంపాదించుచుంటారు. కాని విచారించి చూడగా, ఈ డబ్బుగల ధనవంతులు ఎవరైనా సన్యాసియో లేక బాబానో హిమాలయాల నుండియో లేక ఇతర పుణ్య క్షేత్రాలనుండియో తమ ప్రాంతాలకు వచ్చినప్పుడో లేక వారిని ఆయా ప్రాంతాలయందు కలిసినప్పుడో వారికి సాష్టాంగ దండ ప్రమాణాలు చేయుచున్నారు. ఆ సన్యాసులకు వారి మొలలకు వున్న కౌపీనం (గుడ్డపోచి) తప్ప వేరే గొప్పధనమేమి లేదు. కౌపీనవంతః కడు భాగ్యవంతః. కాని ధనవంతులు అందరూ వారిని మ్రొక్కుటకు వారి వద్ద వున్న జ్ఞానమనే ధనమే కారణము. కనుక జ్ఞానమనే సంపదయే అన్నింటికన్నా గొప్పది. అదియే హిరణ్మయ కోశము. దానిన సాధించినవాడే, పసిడిగల్గు వాడని వేమన నిర్ణయం. దానిని సాధించిన సాధువునకు ప్రకృతి మార్గములోనున్న అజ్ఞాన జీవులందరూ దాసానుదాసులే కదా!

**ఆ.వె॥ ఎన్ని మతములైన నే మంత్రమైనను**
**నిత్యమింత లేక జాడ విడదు**
**సత్యము గలిగున్న జగతిలో ద్విజుడయ్యె**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 5**

ఏ మతాన్ని ఆచరిస్తూవున్ననూ, ఏ మంత్రాన్ని జపిస్తూ వున్ననూ, నిత్యమైన, సత్యమైన అచల పరిపూర్ణ బ్రహ్మమును గాంచకపోయినచో జననమరణ ప్రవాహమును జాడను విడువడు. కాని అచల సద్గురుని చేరుకొని సత్యమైన, నిత్యమైన, సర్వాతీతమైన అచలాన్ని తెలుసుకొన్నవాడే జగతిలో గురుపుత్రుడనబడతాడని వేమన చెప్పుచున్నాడు.

**ఆ.వె॥ బ్రహ్మ నృపతి వైశ్య పతులును శూద్రులు**
**బ్రహ్మ విష్ణు హరులు పశువులెన్న**
**బ్రహ్మము దెలియకను బహు రూపులిట్లైరి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 6**



బ్రహ్మము (ఆత్మ) యొక్క స్థాన స్వరూప స్వభావాలను తెలిసికోకుండానే అనేక జాతులవారు తమలో తామే అగ్రస్థానం కోసం కలహించుకొంటున్నారు. వీరేగాక సృష్టి, స్థితి, లయకారకులగు బ్రహ్మ, విష్ణువు, శివుడు (హరుడు) అనబడు నియమిత దేవతలు కూడా ఆ బ్రహ్మము (ఆత్మ) నుండి దిగజారిన వారే గనుక వీరందరూ పశువులతో సమానమని నిర్ణయం. ఎందుకనగా నియమిత దేవతలగు బ్రహ్మ, విష్ణువు, శివులకు స్వంత విచక్షణా జ్ఞానములేదు. వీరికి స్వనిర్ణయము పనికిరాదు. ఎవరి పని యందు వారే నియమబద్ధముగా నిమగ్నులై వుందురు. అంతేగాక వారికి మూలకారణమైన బ్రహ్మమును తెలుసుకొను తెలివి లేకున్నారు. ఇక అజ్ఞాన పద్ధతిలో వుండి బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులని కలహించుకొనువారు కూడా బ్రహ్మతత్త్వమును తెలిసికోలేనివారే. వీరందరూ పశువులే నని వేమన వచించుచున్నాడు.

అచల గురుని చేరుకొని సాంఖ్యయోగము ద్వారా సర్వము బ్రహ్మమయమని తెలుసుకొన్న సజ్జనునికి సర్వ జీవులు ఏక స్వరూపమని తెలియబడి, సర్వమునందు సమదర్శనము చేయుచుండును. కాని బ్రహ్మతత్త్వమును తెలియని వాడు వ్యష్ఠి భ్రాంతులకులోనై అనేక వర్ణముల రూపములను పొందుచుండునని వేమన యోగి బోధించు చున్నాడు.

**ఆ.వె॥ పరగబొమ్మ గుడ్డు బరికించి చూచిన**
**కులములన్ని యందు గూడ బుట్టె**
**నందరొకట గలియ నన్నదమ్ములె కదా?**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 7**

సాంఖ్యయోగమున పరిశీలించి చూడగా బ్రహ్మమనే గ్రుడ్డు (బ్రహ్మాండం) యందు ఈ కులాలు (వర్ణాలు) పుట్టాయి. కనుక అందరు ఒకే స్థానమునుండి సృష్టియై వచ్చినారు. మరియు లయంలో ఆ స్థానముయందే కలియుచున్నారు. కనుక అందరూ అన్నదమ్ముల్లే, అక్కచెల్లెండ్లే. ఇలా వస్తు నిర్ణయ పద్ధతిని తెలుసుకోకుండా వర్ణాలగూర్చి మూర్ఖంగా వాదించు వారిని గూర్చి

**ఆ.వె॥ బ్రహ్మయెవని కొడుకు పరికింపగా భువి**
**విష్ణువెవని కొడుకు వెలయజూడ**
**శివుడు యెవని కొడుకు సిగ్గెరుగరు జనుల్?**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 8**

అని చెప్పుచున్నాడు. మరియు ఆ ముగ్గురు దేవతలకు మూలము ఒకటే అనుచు

ఆ.వె॥ మూల మెవ్వరనుచు ముగ్గురి లోపల
మూల మెరుగలేరు మూఢ జనులు
మూలము ముగురికిని ముఖ్యమై యుండురా
విశ్వదాభిరామ వినుర వేమ॥ 9

పై పద్యంలో చెప్పుచున్నాడు. కనుక సర్వజీవులు బ్రహ్మాండము నుండే పుట్టినవని తెలియజెప్పుచున్నాడు వేమనయోగి.

కనుక మానవుడు నిర్ణయించుకున్న వంశ పరంపరాగతమైన వర్ణములు అసంగతముగా వున్నవి. తరచి చూడగా వర్ణములన్నింటికి మూలము ఒక్కటే. అదే బ్రహ్మము (ఎరుక).

కం॥ అజ్ఞానమె శూద్రత్వము
సుజ్ఞానము బ్రహ్మమౌట శ్రుతులను వినరా
యజ్ఞానముడిగి వాల్మికి
సుజ్ఞానపు బ్రహ్మమొందె జూడర వేమా॥ 10

కనుక విచారించి చూడగా, సృష్టి రహస్యమును తెలిసికోకుండా వుండి నానావిధ దృశ్యరూప ప్రపంచమందు వ్యష్ఠి రూప భ్రాంతులకులోనై సంచరించు అజ్ఞాన జీవులందరూ శూద్రులే. అనగా గురువుని జేరుకొని వారి ద్వారా బ్రహ్మతత్త్వ విచారణ జేసి సర్వము బ్రహ్మమయమని జ్ఞానయోగము ద్వారా తెలుసుకొని, వ్యష్ఠి పద్ధతిని వదలి సమిష్ఠి పద్ధతియందు ప్రవర్తించు వారందరూ బ్రాహ్మణులే. బోయ కులమందు జన్మించిన వాల్మీకి బ్రహ్మతత్త్వ విచారణ ద్వారా అజ్ఞానాన్ని వీడి జ్ఞాన బ్రహ్మమును పొందాడు కదా! అని వేమన ఉదహరించుచున్నాడు.

ఆ.వె॥ బమ్మ గుడ్డు యనెడి పట్నంబులోపల
బమ్మ యెరుగలేని బాపడేల?
తన మనంబు దెలియ దానెపో బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 11

బ్రహ్మాండమనే పట్టణంబులో జన్మించిన బ్రాహ్మణుడు ఆ బ్రహ్మ తత్త్వమును తెలిసికోనిచో, అతడు 'బ్రాహ్మణుడు' అని అనబడవచ్చునా? లేదు. కాని తన మనస్సు ఎలా వచ్చినదో? అని విచారణ జేయువానికి తానే ఆ బ్రహ్మ స్వరూపమని తెలియబడుచున్నది.



ఆ.వె॥ తాత గన్న తల్లి తమ తండ్రి గనుతల్లి
తన్ను గన్న తల్లి తల్లి తల్లి
తల్లి శూద్రురాలు తానెట్లు బాపడో
విశ్వదాభిరామ వినుర వేమ॥ 12

ఆ.వె॥ ఉదయమునను శూద్రుడుత్తమోత్తముడెట్లు
సతికి శూద్రతయును సర్వగతుల
తల్లి శూద్రురాలు తానెట్లు బాపడో
విశ్వదాభిరామ వినుర వేమ॥ 13

ఆ.వె॥ జనన మరణములను సంధ్య త్రాడులేదు
సంధ్య త్రాడు లేదు జననికెపుడు
తల్లి శూద్రురాలు తానెట్లు బాపడు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 14

యజ్ఞోపవీతము (జంధ్యము) ను బ్రాహ్మణ పురుషులు మాత్రమే ధరిస్తారు. వారి కులములోని స్త్రీలకు ఆ అధికారాన్ని ఇవ్వలేదు. బ్రాహ్మణుల నిర్ణయం ప్రకారం జంధ్యమును ధరించని వారందరూ శూద్రులే. కనుక వారి కులములోని స్త్రీలందరూ శూద్రులని వారి కట్టుబాటు వల్లనే తెలియబడుచున్నది. అట్లయినచో తన తల్లి శూద్రురాలు. మరి తాను బ్రాహ్మణుడు ఎట్లు కాగలడని వేమన ప్రశ్నించుచున్నాడు.

అంతేగాక తాను పుట్టు సమయాన మరియు గిట్టు సమయాన సంధ్యాత్రాడు తనకు లేదు. తన తల్లికి అసలు జంధ్యమే లేదు. అలాంటప్పుడు తన తల్లి శూద్రురాలే కనుక తాను శూద్రుడే కాగలడని వేమన వివరించుచున్నాడు.

ఆ.వె॥ త్రాడు మెడను వేసి తనకు శూద్రత్వంబు
బోయెననెడి దెల్ల బుద్ధి కొదువ
మనసు నిలక త్రాడు మరి వన్నె దెచ్చునా?
విశ్వదాభిరామ వినుర వేమ॥ 15

జంధ్యమును (త్రాడును) మెడల వేసికొని తన శూద్రతనము పోయినదనుకొనుట అజ్ఞానమేనని తెలుపుచున్నాడు వేమనయోగి. మానవుడు తన మనస్సును నిలుప లేకపోయినచో,

అతనికి ఆ త్రాడు వల్ల ఏ ఉపయోగం వుండదు. కనుక యజ్ఞోపవీతము (జంధ్యము) కలవాడే బ్రాహ్మణుడనుట సరియైన నిర్ణయము కాదు. గురువు ద్వారా బ్రహ్మ జ్ఞానమును పొంది త్రికరణ శుద్ధిగా నడచుకొనువాడే బ్రాహ్మణుడని వేమనయోగి సిద్ధాంత నిర్ణయం.

**ఆ.వె॥ కల్లటికెకు భూత గట్టిగా పెట్టిన**
**నందులోని కంపులడగనట్లు**
**మెడను త్రాడు వేసి మెరుపుతో ద్విజుడౌనె?**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 16**

కల్లుకుండకు (బూడిద) ఎంత పూసినను, దానిలోని కంపు వాసన తొలగనట్లు, అంతఃకరణ శుద్ధిలేని కుటిలుడి మెడలో జంధ్యాన్ని వేసినను, అతడు దుష్ట గుణాలను విడిచిన సాత్విక బ్రాహ్మణుడు కాగలడా? లేదని వేమన నడువు చున్నాడు.

**ఆ.వె॥ అంతరాత్మ గనక నల్ప బుద్ధుల తోడ**
**మెలగునట్టి ద్విజులు మేది నందు**
**యముని నరకములకు నరుగంగనిది సాక్షి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 17**

జీవులన్నింటి యందున అంతరముగా, సూక్ష్మరూపముగా నున్న ఆత్మను గురువు ద్వారా గుర్తెరిగిన వారికి మోక్షము కరతలామలకము. అట్లుగాక అంతరాత్మను తెలుసుకోక, దేహమే తాననుకొను మంద బుద్ధులచే కలిసి తిరుగునట్టి బ్రాహ్మణ కులజులు చివరికి యముని పాలై తిరిగి నీచ జన్మలు పొంది నరక యాతనలు పొందుతారని వేమన ప్రవచించు చున్నాడు.

**ఆ.వె॥ వేద శాస్త్రములను వినినేమి గుడిచిరి**
**యరిది తిరిగి చత్తురందరిండ్లు**
**బ్రహ్మ మహిమ దెలసి బ్రతుకుట నిజమయా**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 18**

పూర్వకాలమున వేదశాస్త్రములను వినుటకు కూడా శూద్రులకు అధికారం లేదు. ఒకవేళ ఎవరైనా విన్నను, వారి చెవులలో సీసాన్ని కరిగించి పోసేవారు. ఇది ఎంతటి దురహంకార, స్వార్థ పూరిత చర్యయో తెలుసుకోండి. వేద శాస్త్రములయందు బ్రాహ్మణులకు మాత్రమే అధికారాన్ని కలిగించుకున్నారు. అయినను అందువల్ల వారేమి సాధించారు? అని వేమన ప్రశ్నించుచున్నాడు.



వేదశాస్త్రాదులయొక్క సారాన్ని తెలుసుకోకుండానే, బ్రాహ్మణులు వాటిని మాత్రం వల్లె వేయుచు ఇంటింటికి తిరుగుచూ భైక్షిక వృత్తి ద్వారా పొట్ట పోసుకొనుచు చివరకు వేదాంతసార లక్ష్యమైన పరమోత్కృష్టమైన మోక్షాన్ని పొందకుండానే చనిపోవుచున్నారు.

మానవ జన్మ ఎట్లు సార్థకమవుతుంది? మానవ జన్మ యొక్క లక్ష్యమేమిటి? అని అచటచట విజ్ఞులు ప్రశ్నించుచుంటారు. ఇచట వేమన సమాధానం ఇచ్చుచున్నాడు. ఏ వృత్తితో జీవిస్తున్నప్పటికి, బ్రహ్మతత్త్వమును (ఎరుక రహస్యాన్ని) తెలుసుకొని మళ్ళీ జన్మ రాకుండా నడుచుకోవడమే మానవుని పరమ లక్ష్యము. అలా బ్రతికినప్పుడే అతని జన్మ సార్థకమవుతుందని వేమన బోధించుచున్నాడు.

**ఆ.వె.॥ బిందు రక్తములను బెరసిన దేహంబు**
**చంద మెరుగక ద్విజ శబ్దమిడుక**
**నడచినను విడుచునొ నరకంబు మృత్యువు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 19**

గురువును చేరుకొని, సేవించి, పూజించి సాంఖ్యయోగము ద్వారా దేహము యొక్క పుట్టు పూర్వోత్తరాలను గ్రహించవలెను. స్థూలంగా కనిపించే ఈ మాంసయుత శరీరము శుక్ల, శోణితముల కలయిక వల్ల తల్లి గర్భములో తయారైనది. కాని ఈ స్థూల శరీరమునకు స్వయంగా తెలుసుకొనే తెలివిలేదు. అంతరంగా సూక్ష్మ శరీరం లేనిచో ఇది మొద్దువలె పడివుండును. అంతేగాక సూక్ష్మ శరీరం యొక్క ఆజ్ఞమేరకు స్థూల శరీరం నందు వున్న సర్వాంగాలు (కర్మేంద్రియాలు) పనిచేయుచున్నందున, ఈ 'స్థూలదేహం' శూద్రుడని చెప్పబడుచున్నది. ఇక సూక్ష్మ శరీరం స్థూల, కారణాలకు మధ్య నుండి వ్యవహారాన్ని నడుపుచున్నది. కావున ఇది వైశ్యుడని నిర్ణయం. ఇక సూక్ష్మ శరీరానికి అంతరంగా కారణ శరీరం వుండి సర్వేంద్రియయాలకు జీర్ణవ్యవస్థ ద్వారా రక్షణ కలుగజేస్తుంది. కావున ఇది క్షత్రియుడని నిర్ణయం. ఇక మహా కారణ శరీరం కారణ శరీరానికి అంతరంగా వుండి ఈ మూడు శరీరాలకు ఉనికి పట్టై, సర్వమును తెలిసికొనునదై మరియు తెలియజేయునదై చైతన్యరూపముగా వున్నది. అన్నింటికన్నా సూక్ష్మాతిసూక్ష్మరూపమై సర్వస్వరూపముగా ఆ మహాకారణ శరీరమే వున్నది. కావున ఇది బ్రాహ్మణుడు అని నిర్ణయం. ఇంకా విచారించి చూడగా ఈ నాలుగు శరీరాలు ఒకదాన్నొకటి విడువకనే ఓతప్రోతములై వున్నాయి. అయినప్పటికి పై విధంగా విభజించి చూసుకోవచ్చును. ఇంకనూ విరాట్ పురుషుని నుండి నాలుగు

వర్ణాలు ఎలా కలిగాయంటే స్థూల దేహ లక్షణంను అనుసరించి దేహాన్ని మోసే కాళ్ల (పాదాల) నుండి శూద్రులు, కటి ప్రదేశానికి పాదాలకు ఆధారంగావుండే తొడలనుండి వైశ్యులు, శత్రువుల నుండి కాపాడే భుజస్కంధముల నుండి క్షత్రియులు, జ్ఞానేంద్రియాలు (శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము) దేహము యొక్క శిరోభాగమునందుండి వ్యవహారము చేయుచున్నవి గనుక శిరస్సు నుండి జ్ఞాన సంపన్నులగు బ్రాహ్మణులు పుట్టు చున్నారనుట తార్కికంగా సత్యమే.

లోక వ్యవహారం నందు జూచిననూ ఏ కులమందు పుట్టిన వాడైననూ బుద్ధి బలము గలవాడు బ్రాహ్మణుడగను. దేహ పుష్టి గలవాడు క్షత్రియుడుగా రాణించగలడు. కొని అమ్మే నేర్పు గలవాడు వైశ్యుడగును. జీతగాని వలె నుండు వాడు శూద్రుడగును.

ఈ విధాన మెరుగని వాడు తాను బ్రాహ్మణుడనని సమాజములో పిలుపించు కొన్ననూ, చివరకు మృత్యువును పొంది నరకములో పడతాడని వేమన హెచ్చరించుచున్నాడు.

**కం॥ తొమ్మిది కంతల తిత్తికి**
**నిమ్మగు సొమ్ములును కులము నేటికి జెపుమా**
**నమ్మకు దేహము నాదని**
**బమ్మము నేననుచు దెలిసి పలుకర వేమా॥ 20**

ఈ దేహము నవరంధ్రాలు కల తోలు సంచి (తిత్తి). ఈ దేహము క్రిములకు, రోగాలకు నిలయుమై క్షణ భంగురంగా వున్నది. కనుక నేననగా దేహము గాదని (నాస్తిక వాదమును విడిచి), ఆత్మ తత్త్వవిచారము జేసి నేను బ్రహ్మ స్వరూపమునని తెలుసుకోని వాడికి ఆభరణాలవల్ల గాని, తాను జన్మించిన కులము యొక్క పేరు వల్ల గాని ప్రయోజనము శూన్యము.

**ఆ.వె.॥ లోను బయలు జేసి లోకంబు దెగటార్చి**
**కులము గాలబెట్టి గుణము వదలి**
**చింతలోని చింత జేరిన యోగిరా**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 21**

తనలో నున్న అంతరాత్మను బ్రహ్మాండమను బయలులో ఐక్యముజేసి అనగా ఏక స్వరూపాన్ని పొందించి, ప్రాపంచిక సంబంధమైన అజ్ఞానపు పనులు వీడి, కుల వ్యవస్థను కూడా అతిక్రమించి, గుణత్రయమును (ఎరుకను) కూడా త్యజించి, చింతలోని చింతను జేరిన వాడు యోగియని వేమన తన సిద్ధాంత నిర్ణయము చెప్పుచున్నాడు.



**ఆ.వె.॥ ఆసనంబెరుగక నా మర్మకర్మంబు**
**గురువు చేత దెలిసి గూర్చకున్న**
**మనసు నిల్పకున్న మరి ద్విజుడెట్లగు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 22**

సద్గురువునుజేరుకొని వారి కృపచే తారక, సాంఖ్య, అమనస్క, మహావాక్యములు వీటికి అతీతమై క్షరాక్షరోపాధి ద్వయదోష హరణము చేయు అచల పరిపూర్ణ ప్రబోధ విని కని, దానియందున్న ధర్మ మర్మములను తెలుసుకొని కర్మేంద్రియముల ద్వారా (శరీరం ద్వారా) ఆచరించినవాని మనస్సు నిర్మలముగా నుండును. అట్టివాడు ద్విజుడనబడును. ఈ విధానమును తెలుసుకోనివాడు బ్రాహ్మణ కులములో పుట్టిననూ పేరుకే ద్విజుడు గాని, నిజమైన ద్విజుడు గాడు.

**ఆ.వె.॥ ఏకమైన వర్ణమెరిగిన యోగికి**
**పరము నెరిగి జూడ భావమొందు**
**యాకృతులను మరియు నన్నిట తానౌను**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 23**

సృష్టి రహస్యమును తెలుసుకొని సాంఖ్యయోగమును సాధించిన సజ్జనుడు నానావిధ దృశ్య ప్రపంచమును వీడి ఏకైక ఆత్మస్వరూపమును పొందివుండును. అతనికి సర్వవిధ వస్తువులందు, జీవులందు, ఆకృతులయందు ఆ ఆత్మభావము మాత్రమే కనిపించుచుండును. అన్నియు తానై వున్న విధానమును ఎరిగివుండును. 'ఏకం అనేకం భవతి' మరియు 'అనేకం ఏకం భవతి' అను వస్తు నిర్ణయ పద్ధతినెరిగి ఆత్మైక్య భావమందు సంచరించును. ఆ ఏక బ్రహ్మము యొక్క వర్ణము ఏది? అనగా అది పాటలీ వర్ణము. అదే ఏకాక్షరమైన 'ఓం' కారముగా ధ్వనించినది. అద్దాని యందే 'అ'కారమగు శూద్రవర్ణము, 'ఉ'కారమగు వైశ్య వర్ణము, 'మ' కారమగు క్షత్రియ వర్ణము, అర్ధమాత్రక(అరసున్న) యగు బ్రాహ్మణ వర్ణము లేర్పడినవి. బ్రాహ్మణ వర్ణమునుండి మహాకారణ శరీరము, క్షత్రియ వర్ణము నుండి కారణశరీరము, వైశ్యవర్ణము నుండి సూక్ష్మ శరీరము, శూద్రవర్ణమునుండి స్థూల శరీరము కలిగినవి. కనుక ఈ నాలుగింటికి కారణమైన ఏక వర్ణమును గాంచిన వాడే యోగియని వేమన ప్రవచించుచున్నాడు.

**ఆ.వె.॥ పంచవర్ణి నెరుగ పరము నెరుంగును**
**పరము నెరిగి నిచ్చ ప్రజ్వరిల్లు**
**ప్రజ్వరిల్లువాడు పరము తానౌనయా**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 24**

పంచవర్ణములగు సునీలము, ధూమ్రము, అసితము, శుభ్రము, రక్తము అను అయిదు వర్ణముల తత్వమును పూర్తిగా తెలిసికొనినవాడు పరమాత్మను ఎరుగగలడు. పరమాత్మను ఎరిగినవాడు ఆ ప్రకాశముచే ప్రజ్వరిల్లుచుండును. అలా ప్రజ్వరిల్లువాడు ఆ పరమాత్మ కన్నా భిన్నము కాడు అని వేమన బోధించుచున్నాడు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, ఛండాల యను పంచవర్ణముల వారి పుట్టుక స్థానమును ఎరిగినవాడు, పరమాత్మ స్థానమును కూడా సులభంగా గాంచ గలడని వేమన పరోక్షంగా ఇచట తెలియజేయుచున్నాడు. కనుకనే భగవద్గీతయందు

శ్లో॥ విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని।
శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః॥ అని శ్రీ కృష్ణ పరమాత్మ చెప్పి యున్నాడు. దీని అర్థమేమనగా -

"విద్యా వినయ సంపద గల బ్రాహ్మణుని యందును, గోవుయందును, ఏనుగు యందును, కుక్కను, కుక్కను వండుకొని తిను ఛండాలుని యందును పండితులు సమదృష్టి కలిగియుందురు' '. అనగా సర్వజీవులు అయిదు వర్ణముల వారందరూ ఏక బ్రహ్మముగా నున్న పరమాత్మ నుండియే పుట్టిరని నిర్ణయం. కనుక ఈ వర్ణ భేదములు అజ్ఞానులగు నరులకు మాత్రమే కనిపించుచున్నవి. కాని జ్ఞానియగు వానికి సర్వజీవులు ఏక స్వరూపమనియే తెలియబడును. ఆ ఏకమందే ఈ వర్ణభేదములు ఓతప్రోతములై (పడుగుపేకలై) వున్నవని చెప్పక తప్పుట లేదు.

**ఆ.వె॥ ఎట్టివాడో తాను యెరుగడు తొలిపుట్టు**
**నీచ బ్రతుకు కింత నీమమేల**
**నెరుగడీ జగంబు నీశ్వరమయమని**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 25**

ఏ వర్ణమునందు గాని, ఏ కులమునందు గాని పుట్టిననూ, ఆ పుట్టినవాడు తన మూల స్థానమును ఎరుగక పాటించు ఆచారవిచారములు వ్యర్థములు అనియూ, వాడి బ్రతుకు నీచమైనదనియూ వేమన నుడువుచున్నాడు. వాడు ఈ జగత్తు ఈశ్వరమయమని (పరమాత్మ మాయయని) తెలుసుకోలేడని భావము.

**ఆ.వె॥ కొంత నల్లగుండు కొంత యెర్రగ నుండు**
**కొంత తెల్లగుండు కుతల మెరుగ**
**నొక్కరీతి నుండ నొగి కారణంబేమి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 26**



కొంత నల్లగా, కొంత ఎర్రగా, మరికొంత తెల్లగా ఈ ప్రపంచంలోని వస్తువులు గాని, మనుషులుగాని వుంటున్నారు. దీనికి కారణమేమనగా సర్వసృష్టి త్రిగుణస్వరూపమైన ఎరుక నుండే కావడం. సత్వగుణము (తెలుపు), రజోగుణము (ఎరుపు), తమో గుణము(నలుపు) లనబడు ఈ త్రిగుణములు ఆత్మయందే అమరి వున్నవి. కనుక ఆత్మ నుండియైన పంచభూత వస్తుసముదాయమందును, సర్వజీవ రాశులందును ఈ రంగుల మిశ్రమము తప్పని సరిగా కనిపించుచున్నది. కనుక ఈ త్రిగుణాలనుండియే నాలుగు వర్ణాలు కలుగుచున్నవని వేమన తెలుపుచున్నాడు.

**ఆ.వె॥ బ్రహ్మతలను జిదుమ బ్రహ్మ హత్యయటండ్రు**
**బ్రహ్మ వైశ్యుడెన్న బాపడగునె?**
**బ్రహ్మ జచ్చిన గద బ్రహ్మఘ్నుడగు శూలి**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 27**

బ్రహ్మతలను చిదిమి వేసినచో, దానిని బ్రహ్మ హత్య అందురు. కాని బ్రహ్మ వైశ్యుడు (మూడవ వర్ణమునకు చెందినవాడు). ఎందుకనగా విష్ణువు (విరాట్ పురుషుని) యొక్క బొడ్డునుండి బ్రహ్మ పుట్టినాడు గనుక ఆయన బ్రాహ్మణుడు కాదు. కావున శివుడు ఒకవేళ బ్రహ్మను చంపినను, అది బ్రాహ్మణుని హత్య అనబడదని తెలుపుచు, పద్యములో బ్రహ్మ వైశ్యుడని నిర్ణయించి చెప్పుచున్నాడు వేమన యోగి. కనుక బ్రహ్మ సంతతి వారిని బ్రాహ్మణులనుట తగునా? తగదు కదా!

**ఆ.వె॥ మాల కులము యాలి మలమూత్ర బంధము**
**పుట్టదే శివంబు పొట్టలోన**
**మనసు యాత్మ బుద్ధి మరి బ్రహ్మమూర్తిరా**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 28**

కులము అనే భేద బుద్ధియే మాలతనము. భార్య (ప్రకృతి) అనేదే మల మూత్రముల సంచి. దానియందే శివ (ఆత్మ) స్వరూపముదైన శిశువు పుట్టుచున్నాడు. కాని తత్వ విచారణ ద్వారా ఆ పుట్టిన వాడు ఆత్మ నిశ్చయ జ్ఞానమును పొంది మనస్సును ఆత్మలో లయం చేయుట వలన బ్రహ్మ స్వరూపమును పొందగలడని వేమన ప్రవచించు చున్నాడు.

ఆ.వె॥ సత్యము గలిగున్న జగతిలో వారికి
జ్ఞానమమర గలుగు మానుగాను
సత్యము తెలివియును సమయంగ ద్విజుడగు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 29

జగత్తులో ఎవరైతే సత్య పద్ధతిగా నుందురో, వారికి సులభంగా గొప్ప జ్ఞానము కలుగుతుంది. కాని సృష్టి వివరమును పూర్తిగా తెలుసుకున్న వాడికి సత్యము, జ్ఞానము ఈ రెండు ఎరుక యొక్క రూపములేనని తెలియబడుతుంది. సత్యం = స+తి+యమ్.'స' - అమృతం, 'తి' - మర్త్యం, యమ్ ఈ రెంటిని ఏకముచేయునది. ఆ రెంటిని వీడిన వాడే ముక్తుడు. అతడే ద్విజుడని పిలువబడుతాడని వేమన యోగి ప్రవచించుచున్నాడు. ఇచట సత్యాసత్యములు, జ్ఞానాజ్ఞానములు మొదలగునవి ఎరుక (బ్రహ్మము) యొక్క ద్వంద్వరూపములు. కావున యోగి వేమన ద్వంద్వాతీతుడైన వాడే ద్విజుడని చెప్పుచున్నాడు.

ఆ.వె॥ అగ్నిచేత బట్టి యా పరమేశుని
నిందజేసి ద్విజులు నీచులైరి
పలుదెరువుల నేగి భ్రష్టైరి ద్విజులెల్ల
విశ్వదాభిరామ వినుర వేమ॥ 30

అగ్నిని చేతులలోకి తీసుకొని పరమేశుని నిందించుటవల్ల ద్విజులు నీచులైరి. అంతియేగాక వారు అనేక వక్రమార్గాలలో పయనించుచు బ్రాహ్మణత్వము కోల్పోయారని వేమన యోగి వారి సంతతి గూర్చి చెప్పుచున్నాడు.

ఆ.వె॥ బాప డెముక కూడు భక్షించు చుండును
పేరటంబు బోవు పెండ్లి మగువ
కులము మానము విడి కోర్కెలు మెండాయె
విశ్వదాభిరామ వినుర వేమ॥ 31

ఒక బ్రాహ్మణుడు బొక్కల కూర తినుచుండును. ఒక పెండ్లియైన యువతి (నవ వధువు) పేరంటంబుకు(బంధుమిత్రుల ఇండ్లకు పిచ్చాపాటిగ మాట్లాడి విందు స్వీకరించుటకు) పోవును. వీరిలో ఒకరు కులమును మరొకరు మానమును (Character) మితిమీరిన కోర్కెల వల్ల



కోల్పోవుచున్నారు. దీనివల్ల తెలిసేదేమంటే ఉత్తమ కులములో జన్మించినప్పటికి వారి యొక్క మనసును నిలుపలేక, కోర్కెలు పెంచుకున్నచో ఆ ఉత్తమ సద్గతిని కోల్పోవుచున్నారని వేమన నుడువుచున్నాడు.

ఆ.వె॥ ద్విజ వరుండు చెడ్డ పిండంబు దినబోయె
పేరటాలు ముసరు పెండ్లి మొనసి
కులము మొదలు బోయె గూలె బోమానంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 32

వేమన పిండ ప్రదానాదులను దురాచారాలను నిరసించెను. ద్విజులమని చెప్పుకొను కొందరు ఒకవైపు పిండములు ఆరగిస్తారు మరొకవైపు (అదేరోజు) పెళ్ళిళ్ల నిర్వహించుటకు పేరంటంబులకు పోవుచుంటారు. ఈ విధంగా వారు కులాన్ని, మానాన్ని కోల్పోవు చున్నారని వేమన వచించుచున్నాడు.

ఆ.వె॥ మద్యమాంస రుచిని మాదెగెదైవాల
యెంగిలి దినువారి దెట్టి కులము
భక్తిని హరుగొల్చి భవ్యులు గారైరి
విశ్వదాభిరామ వినుర వేమ॥ 33

కొందరు క్షుద్రదేవతలను పూజించి వారికి మద్యము, మాంసములను సమర్పించి, మిగిలిన ఎంగిలిని తిందురు. ఇట్టి వారిది ఏ కులము? వారిది ఏ కులమో చెప్పుటకు అలవికాదు. కాని అట్టివారు భక్తియోగము ద్వారా హరు(ఆత్మ)ని గొల్చి కీతార్థులుగారైరని వేమన నుడువుచున్నాడు.

ఆ.వె॥ ప్రళయకాలమందు ప్రమథులచేతను
నష్టమైరి గాని నాటి జనులు
తెలియనేర్వరైరి దేవుని ద్విజులెల్ల
విశ్వదాభిరామ వినుర వేమ॥ 34

శివునియొక్క ప్రమథగణముచే ప్రళయమునందు జనులు నశింపజేయ బడుచుందురు. అగ్ని అధిష్ఠాన దేవతయగు రుద్రుడు 'రం' బీజము యొక్క ప్రేరేపణచేత జ్ఞానశక్తి రూపుండై రూపతన్మాత్ర ద్వారా అగ్ని భూతమునుండి సర్వ జీవులను లయం చేయును. అనగా రూపములను మార్చును. కాని నేడు బ్రాహ్మణులమనుకొనువారు అట్టి దేవుడిని తెలుసుకోలేక పోవుచున్నారు.

ఆ.వె॥ సోమయాజి బట్టి సొడ్ల వేసెను రంభ
యొందె సోమయాజినొంగ బెట్టి
క్రతువు జేయు ఫలము కల్గెరా చేజేత
విశ్వదాభిరామ వినుర వేమ॥ 35

దేవతల నాట్యగత్తె యైన రంభ సోమయాజిని (ఒక యజ్ఞకర్తయగు బ్రాహ్మణుడిని) అవమానపరచి, తిరస్కరించెను. కాని ఒక రకమైన క్రతువు చేయుట వల్ల రంభ సోమయాజితో జేరెను. కాని ఆ క్రతువు చేయుట వల్ల కలిగిన ఫలమేమనగా సోమయాజి భ్రష్టుడు కావడమేనని వేమన వచించుచున్నాడు. కనుక ఇట్టి క్రతువులతో బ్రాహ్మణులు భ్రష్టులవుచున్నారని వేమన ఇచట తెలుపుచున్నాడు.

ఆ.వె॥ పేరు సోమయాజి పెను సింహబలుడయా
మేక పోతుబట్టి మెడలు విరుచు
గాక క్రతువు వంక గలుగునా మోక్షంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 36

ఆ.వె॥ సోమయాజి ననుచు సొంపుతో వేషంబు
గట్టి మాంసమెల్ల గాల్చి తినుచు
ద్విజుడ నేననగ నధికమేమి తనవల్ల
విశ్వదాభిరామ వినుర వేమ॥ 37

రంభను వాంఛించి క్రతువు చేయు సోమయాజి పేరుకు మాత్రమే బ్రాహ్మణుడుగాని, అతడు సింహము (పశువు)తో సమానము. ఎందుకనగా సింహము ఒక జంతువుగా వుండి ఇతర జంతువులను వేటాడి చంపి తినును. అట్లే క్రతువు యందు, ఇతడు మేక పోతులను మెడలువిరిచి చంపి బలి ఇచ్చి తినును. ఇట్టి హింసాయుత కార్యముల వల్ల మోక్షము కలగదని, అతడు బ్రహ్మతత్త్వాన్ని పొందలేడని వేమన బోధించుచున్నాడు.

ఆ.వె॥ మునిగి బ్రాహ్మణుండు ముందు గానక బోయె
తిరిగి తిరిగి యతడు దిమ్మరాయె
కూసి కూసి తుదకు కుక్కయై పోయెరా
విశ్వదాభిరామ వినుర వేమ॥ 28



బ్రహ్మతత్త్వము (ఎరుక) యొక్క రహస్యాన్ని తెలిసికోలేక బ్రాహ్మణులమని పేరుకు చెప్పుకొనువారు నదులలో మునిగి మునిగి మృత్యువును పొందుచున్నారే తప్ప ఆ తర్వాత ఏమవుతుందో తెలుసుకోలేక పోయారు. అనేక దేవతా క్షేత్రములను సందర్శించి, సందర్శించి రాళ్లను మ్రొక్కి మ్రొక్కి రాళ్ళే అవుచున్నారు తప్ప ఆత్మ నిశ్చయ జ్ఞానము ద్వారా తమ దేహాలయందున్న ఆత్మయే దైవమను నిజాన్ని తెలిసికోలేకపోవు చున్నారు. వేదసారాన్ని గ్రోలకుండా వేదాలను వల్లించి, వల్లించి బ్రాహ్మణుడు కుక్కయై పోవుచున్నాడు. కనుక వేదశాస్త్రముల సారమును గురువు ద్వారా గ్రహించి బ్రహ్మతత్త్వమును అనుభవ పూర్వకముగా తెలిసికొన్న జ్ఞాని మాత్రమే బ్రాహ్మణుడుగాని, ఇతరులు గారని వేమన పరోక్షంగా ప్రవచించుచున్నాడు.

ఆ.వె॥ లలి నెనుబదినాల్గు లక్షల జీవులు
బ్రహ్మ కొడుకు లగును ప్రకటితముగ
జ్ఞానము గలిగినను గలుగును బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 39

సృష్టికర్తయగు బ్రహ్మ యొక్క సృష్టిలో 84 లక్షల రకాల జీవ రాసులున్నవి. ఇవన్నియు విచారించి చూడగా బ్రహ్మయొక్క కొడుకులే. అయిననూ ఇందులో ఎవరైననూ ఆత్మజ్ఞానము సంపాదించినచో, వాడు బ్రాహ్మణుడే యగును అని వేమన ప్రవచించుచున్నాడు.

ఆ.వె॥ సకల వస్తుజాల సంతతి తనువులు
పుట్టె నిందు పంచ భూతములను
దాని చేత దగ నుదర పోషణము జేయు
వారు నిజమెరుంగ లేరు వేమ॥ 40

సకలమైన వస్తు సముదాయము, వివిధ జాతులవారి (వర్ణముల వారి) సంతతి, వారి శరీరాలు పంచ భూతముల నుండియే ప్రభవించాయి. వాటి వల్లనే వారి శరీరాలు పోషించబడుచున్నాయి. అయిననూ సామాన్య నరులు ఈ రహస్యాన్ని తెలుసుకోలేక పోవుచున్నారని వేమన నుడువుచున్నాడు.

ఆ.వె॥ అవుట గామెరుగని యజ్ఞాన జీవులు
మూలము దెలియకను ముట్టుచేత
యను దినము సృజించి యాత్మ దెలియలేక
చచ్చి పుట్టు చుండ్రు జగతి వేమ॥ 41

ఏ వర్ణమునందు పుట్టిన వారైనను ఇది ఇలా అవుతుంది లేక అది అలా కాదు అని తెలుసుకోలేని వారు అజ్ఞాన జీవులు. సర్వమునకు మూలమైన బ్రహ్మతత్త్వమును సంపూర్తిగా తెలుసుకొని వాడు ముట్టలోనే (దేహాత్మ భావమును వీడక) వుండి మరికొన్ని జీవులను పుట్టిస్తాడు తప్ప ఆత్మ తత్త్వమును తెలిసికో లేక పోవుచు, ఈ నరక కూపమునందు చచ్చి పుట్టుచుండును అని వేమన యోగి బోధించుచున్నాడు.

ఆ.వె.॥ అంటువిడని గుణము యది దేహ సుఖమౌను
యంటువిడిన గుణము యాత్మ సుఖము
కనుక నిట్టి గుణము కల్గిన కల్గురా
విశ్వదాభిరామ వినుర వేమ॥ 42

ఏ వర్ణము వారైనను దేహమే తామనుకొనువారు పొందే సుఖము దేహ సుఖమనబడును. దేహమనే (క్షేత్రమనే) మైలను వీడిన వారు పొందే సుఖము ఆత్మ సుఖము. కనుక దేహమే తాననుకొను కించిజ్ఞత్వ స్వరూపమును వీడి తాను సర్వ జీవులయందువున్న ఆత్మ స్వరూపము కన్నా వేరుగా లేనని తెలిసికొని ఏక బ్రహ్మము యొక్క స్థితిని పొందిన వాడికి ఆత్మసుఖము అమర గలదని వేమన యోగి ప్రవచించుచున్నాడు.

ఆ.వె.॥ బ్రాహ్మణులకు బెట్ట ఫలము గల్దని గుంద్రు
కుక్కలకును బెట్ట కొదువయేమి?
ఇందునందు జీవుడొక్కడె యందురు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 43

నాలుగు వర్ణముల వారు, సర్వజీవులు ఒకే ఆత్మ స్థానమునుండి సృజించబడినారు. కనుక ఇందులో ఒక బ్రాహ్మణునికి అన్నము పెట్టిన గొప్ప ఫలము, ఒక కుక్కకు పెట్టినచో తక్కువ ఫలమా? అని వేమన ప్రశ్నించుచున్నాడు. ఈ పద్యము వేమనకు సర్వజీవులందువున్న సమదృష్టిని తెలుపుచున్నది. అన్ని జీవరాసులందు వున్న ఆత్మ స్వరూపము ఒక్కటియే కదా! కనుక భేద బుద్ధిని వీడుమని వేమన ప్రవచించుచున్నాడు.

ఆ.వె.॥ శివుడు బ్రహ్మమనుచు స్మృతులెల్ల బలుకంగ
వేరె దైవములను వెలయ గొల్చి
బ్రహ్మ జనులు జూడ భ్రష్టయి పోయిరి
విశ్వదాభిరామ వినుర వేమ॥ 44



శివుడనగా సర్వ భూతములయందు చైతన్య (తెలివి) రూపముగా వున్న ఆత్మయే. అట్టి ఆత్మయే బ్రహ్మమనుచు స్మృతులన్నియు చెప్పుచుండగా, ఆత్మ పూజ చేయజాలని బ్రాహ్మణులు ఇతర దేవతా విగ్రహములను ప్రతిష్ఠించి పూజించుచున్నారు. అందుచేత బ్రాహ్మణులు బ్రహ్మతత్త్వమునందు మనసు నిల్పలేక పంచభూత సంబంధమైన తీర్థక్షేత్రములందు మరిగి అధోగతి జెంది భ్రష్టులగుచున్నారని వేమన యోగి ప్రవచించుచున్నాడు.

ఆ.వె.॥ బ్రహ్మజాతి వారు భ్రష్టయి పోయిరి
ఋషుల జాతి వారు రిత్తలైరి
రోతయైన వారి రోయక పిల్తురో
విశ్వదాభిరామ వినుర వేమ॥ 45

'బ్రహ్మ' జాతి నుండి వచ్చిన రావణ బ్రహ్మ మొదలగు వారు భ్రష్టులు అయిపోయిరి. అనగా బ్రహ్మతత్త్వమునుండి దిగజారి రాక్షసులు (లోకకంటకులు)గా మారిరి. ఇక ఋషుల జాతి నుండి వచ్చిన భృగు మహర్షి మొదలగు వారు వట్టి వారైరి. ఒకానొక సందర్భంలో భృగు మహర్షి కోపోద్రిక్తుడై విష్ణువు యొక్క వక్ష స్థలంపై తన్నెను. అందుచే విష్ణువు భృగు మహర్షి యొక్క త్వగేంద్రియాన్ని త్రుంచి వేసెను. అలా భృగువు వ్యర్థుడయ్యెను. అట్టి జాతి వారిని రోయకుండా ఇంకా తమ వద్దకు ఎందుకు పిలుస్తారని వేమనయోగి ప్రశ్నించు చున్నాడు.

ఆ.వె.॥ హింస జేయకుంటయే ముఖ్య ధర్మంబు
యనక హింస జేతు రవని సురలు
చావు పసిని దినెడు చండాలుడే మేలు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 46

'హింస చేయకుండా వుండుటయే ముఖ్యమైన ధర్మము' అని చెప్పుచుందురు బ్రాహ్మణులు. అయినప్పటికి యజ్ఞయాగాదులు చేయునప్పుడు బ్రాహ్మణులు, భూసురలు (భూపాలురు) జంతువులను బలి ఇచ్చుచున్నారు. కనుక వేద జ్ఞానము సంపాదించిన బ్రాహ్మణుడు హింస చేయుచున్నాడు. వీరితో పోల్చితే చండాలుడే నయం. ఎందుకనగా, వాడు చచ్చిన పశువులును తింటాడు గనుక.

ఆ.వె.॥ బడుగు ద్విజులు గూడి లొడుగు మంత్రము జద్వి
వడుగు జేసెదమని వదరకొంద్రు
కడుగు ద్రావు కాకి కావుమన్నట్లయా
విశ్వదాభిరామ వినుర వేమ॥ 47

వేదాంత సారమును గ్రహించని ద్విజులందరు గూడి దిక్కు మాలిన మంత్రాలు చదువుచు ఒక బాలుడిని తమ కులస్థుడిగా (బ్రాహ్మణునిగ) మార్చెదమని చెప్పుదురు. బియ్యాన్ని కడుగగా వచ్చిన నీటిని 'కడుగు' అందురు. ఆ కడుగు త్రాగిన కాకి కావు, కావు మని ఎలా అరుస్తుందో, అలానే వేదాలలోని మడ్డిని గ్రహించిన వీరు వదరుచున్నారని వేమన యోగి చెప్పుచున్నాడు.

బ్రాహ్మణుల కులమందు జన్మించిన వారందరూ (ఉపనయనము (వడుగు) జరుగనంతవరకు) శూద్రులేనని వారి నిర్ణయం. కనుకనే ఉపనయనము కాని బాలురను తమ భోజన పంక్తిలో కూర్చోనివ్వరు. ఒకానొక సమయమున ఆ బాలుడికి లేక యువకుడికి జంధ్యాన్ని మెడలో వేసి మంత్రాలు చదువుచు తమ బ్రాహ్మణ కులస్థునిగా చేసుకుందురు. ఇదంతా బాహ్యంగా జరిగే తంతుగాని, ఆ బాలుడు లేక యువకుడు బ్రాహ్మజ్ఞానమును (మూడవ కన్ను అనబడే) జ్ఞాన చక్షువును తెరువనిచో (పొందనిచో) బ్రాహ్మణుడే కాడు. కావున వారి వింత పోకడలను కాకితో పోల్చుచున్నాడు. ఎందుకనగా కాకి ఎల్లప్పుడూ ఒకే వైపు చూడగలదు. కాని రెండో వైపు చూడలేదు. అంతేగాక కాకి కుండలోని జలాన్ని మాత్రమే గ్రహించగలదు కాని సముద్రంలోని జలాన్ని త్రాగలేదు. అట్లే బడుగు ద్విజులు వ్యవహారమునకు (ప్రాపంచికమునకు) తప్ప పారమార్థిక చింతనకు పనికి రారని వేమన ఉదహరించుచున్నాడు.

**ఆ.వె॥ కులము చేత బట్టి గుంపించ నేటికి**
**పాదు వున్న చోట ప్రబలు విత్తు**
**యేటి కులము యింక నెక్కడి ద్విజుడయా**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 48**

కులము పేరు చెప్పుకొనుచు గర్వపడుట ఎందుకు? పాదువున్నచోట విత్తిన విత్తు మహా వృక్షమవుతుంది. పాదు సరిగా లేనప్పుడు పోసిన నీరు ఉపయోగం కాక విత్తు వృక్షంగా ఎదగలేదు. అలానే శీలము (Character) మంచిదైతే చదివిన చదువంతా ఉపయోగపడుతుంది. శీలవంతుడు యోగవంతుడవుతాడు. సమాజానికి ఉపయోగ పడతాడు. వాడికి కులముతో పనిలేదు. వాడు ఏ కులములో పుట్టినను గొప్పవాడే. ఇలా కాకుండా కులముపేరుతోనో, లేక ద్విజులమను (బ్రాహ్మణులమను) పేరుతోనో బెదిరించుట ఎందుకని వేమన వచించుచున్నాడు.

**ఆ.వె॥ క్రతువు జేసెద మని కడు విర్రవీగుచు**
**కచ్చ గడుగు నెయ్యి కడుపు నించి**
**రంకు కొడుకులను రంగాన మెత్తురో?**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 49**



క్రతువును చేసెదమని మిక్కిలి విర్రవీగు చుంటారు బ్రాహ్మణులు. వీరి క్రతువిధానము ఎంత నీచముగా వుంటుందనగా - వీరు క్రతువును జరిపే కార్యక్రమంలో స్త్రీల యోనులను నెయ్యితో కడిగి దానితో కడుపు నింపుకుంటారు. ఈ రంకు కొడుకులను సమాజము మెచ్చుకుంటుందా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు.

**ఆ.వె॥ శూద్రులనుచు చూడ శూద్రుల బోనాడి**
**మాల కంటెను గడు మాలయగుచు**
**ద్విజుడ నేనటన్న ద్విజుడు గానేర్చునా**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 50**

బ్రహ్మజ్ఞనమును పొందిన బ్రాహ్మణుడు సర్వ జీవులు ఏక రూపమైన ఆత్మయేనని తెలిసికొనివుండును. అట్టివాడు మళ్ళీ వేరొకన్ని శూద్రుడని, శూద్రులను నిందించుటచే, వాడు ఆ జ్ఞానం నుండి దిగజారినవాడై మాల వాని కంటెను చెడ్డ మాలవాడగుచున్నాడు. అట్టివాడు నేను ద్విజుడనని చెప్పుకొనుట వల్ల ద్విజుడు కాగలడా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు.

**ఆ.వె॥ పరగ గడ్డి దినెడు పశువుల విశసించి**
**మనుజులు దిని భువిని మాలలైరి**
**యందరి పియిదినెడు పందుల కోళ్ళను**
**దినిన కులము యేటిదిలను వేమ॥ 51**

**ఆ.వె॥ కసువు నేరి తిన్న పసరపు మైదిన**
**మాలదంద్రు వాని మహిని జనులు**
**పందిగోడి దిన్న ప్రాజ్ఞుడందురు జనుల్**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 52**

పశువులు (గోవులు, బర్రెలు, మేకలు మొ॥) శుద్ధమైన గడ్డిని మాత్రమే తినును.వాటిని తినే వారిని భూమిలోని జనులు మాలలని అందురు. కాని పందులు, కోళ్ల అసహ్యాకరమైన, అశుద్ధమైన పదార్థాలను తినును. వాటిని తినే వారిని తెలివైన వారని జనులందురు. ఈవిధంగా మాలలని వారిని నిందించుట, ప్రాజ్ఞులని వీరిని పొగడుట తర్కరహితమని వేమన బోధించుచున్నాడు.

**ఆ.వె॥ మాల మాంసము దిను, మరి సర్వ జనులెల్ల**
**క్రొవ్వు దిందు రొక్క కులము గాదె**
**కులములన్ని యొక్క కులముగా జూడరో**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 53**

మాల మాంసము తినును. సరే. మిగతా జనులందరూ క్రొవ్వు తినుట లేదా? ఎలా? ప్రతి పదార్ధమందు ఎంతో కొంత క్రొవ్వు (Fat) తప్పక వుంటుంది. పాల యందు, పాలనుండి తయారైన పెరుగు, మజ్జిగ, నెయ్యిల యందు కూడా క్రొవ్వు వున్నది. ఇతర శాఖాహారములయందు కూడా క్రొవ్వు వున్నది. ఇతర శాఖాహారములయందు కూడా క్రొవ్వు వున్నది. కనుక పోల్చి చూడగా మాంసాహారము మరియు శాఖాహారములందు క్రొవ్వు వుండియే వున్నది. కనుక సర్వజనులు ఒకే కులమునకు చెందిన వారని జనులు చూడరాదా? అని వేమన కోరుచున్నాడు.

ఇంకా విచారించి చూడగా ఏమీ తినక గాలి పీల్చుకొని ఉచ్ఛ్వాస నిశ్వాసలు చేసి బ్రతుకే వారు కూడా సంవత్సరానికి కోడి గ్రుడ్డంత మాంసాన్ని తింటూనే వున్నారు. ఎలా? అనగా- గాలిని పీల్చటం ద్వారా గాలిలోని సూక్ష్మజీవులు శరీరంలోనే చనిపోయి అతనికి ఆహారం అవుతున్నాయి. ఇంకనూ కొంతమంది యోగ సాధన ద్వారా సమాధిలో వుండి బయటి నుండి గాలిని కూడా పీల్చుకుండా, హంసను వెన్నెముకలో అంతరముగా ఆడించుచు బ్రతుకుచున్నారు గదా! మరి వారి సంగతేమిటి? వారు కూడా మాంసాన్ని తింటున్నారు. ఎలా? అనగా యోగ సమాధిలోకి వెళ్లే ముందు అతని శరీర భారం కంటే, దాని నుండి బయటకు వచ్చిన తర్వాత భారం తగ్గుతుంది. తగ్గిన శరీర భారం ఏమైనట్టు? కనుక ఆ యోగ నిద్రయందు ఉన్నప్పుడు తన మాంసాన్ని (శరీరాన్ని) తానే తింటున్నాడు కదా! కనుక సర్వజనులు ఒకే కులమని వేమన యొక్క వేదాంతము.

**ఆ.వె॥ మాల వాని నేల మరి మరి నిందింప**
**నొడల రక్త మాంస మొకటి గాదె**
**వానిలోన మెలగు వాని కులంబేది?**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 54**

మాలవానిని మరి మరి నిందించుట ఏల? అతని శరీరంలో వున్నది, మన శరీరంలో వున్నది రక్తమాంసాలే కదా! అన్ని జీవరాసులందు ఒకే ఆత్మ ప్రకాశించు చున్నది. కనుక పరమాత్మ సృష్టిలోని జీవులందరూ సమానమేనని వేమన ఉద్ఘాటించు చున్నాడు. కనుక మాలవానిలో నున్న ఆత్మ ప్రకాశము యొక్క కులమేది? అది ఏ ఒక్క కులమునకు చెందినది కాదు. కాని అన్ని కులాలు దానియందే ఉద్భవించుచున్నవని పరోక్షంగా తెలియ పరచుచున్నాడు మహాయోగి వేమన.

**ఆ.వె॥ మంగలి కయి గిన్నె మహిమీద జనమెల్ల**
**పొత్తు గుడిచి కులము పొగడనేల**
**తల గుడి చెయి బెట్టి తగనమ్మ జెప్పదు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 55**



మహిలోని జనులందరు మంగలి వాని చేతి గిన్నె వలె నున్నారు. అన్ని కులాల వారికి మంగలి ఒకే గిన్నెను వాడుచున్నాడు. కనుక ప్రతి మనిషిలో అన్ని కులాల లక్షణాలు కనిపించుచున్నవని పై ఉదాహరణలో తెలియబడుచున్నది. వివిధ కులాలకు చెందినవారు గుంపులు, గుంపులుగా జేరి వారి వారి కులాల గూర్చి గొప్పగా చెప్పుకొనుచున్నారు. అందువలన ప్రయోజనం లేదు. ఎందుకనగా ప్రతి కులంలో గొప్పవారు, నీచమైన వారు వుండియే వుంటారు. కనుక సర్వ మానవాళి ఒకే కులమునకు చెందినవారు. ఆ కులమే మానవ కులమని, తన శిష్యుని శిరముపై తన కరముంచి (కుడి చేతినుంచి) ఆశీర్వదించి, వస్తు నిర్ణయ పద్ధతిగా బోధిస్తానని వేమన యోగి ప్రవచించుచున్నాడు.

**కం॥ స్థావరముల భక్షింతురు**
**భావింపగ జంగమములు బహువిధరుచులన్**
**యావల సకల ప్రాణులు**
**తీవరమున తమ్ము దామె తిందురు వేమా॥ 56**

కొందరు లోకమున ఆహారపు అలవాట్లను బట్టి కొందరిని గొప్పవారని, మరికొందరిని నీచులని చెప్పుచున్నారు. మాంసాహారాన్ని తినువారిని తక్కువ వారని, శాఖాహారాన్ని మాత్రమే తినువారిని ఎక్కువ వారని జనులు చెప్పుకొనుచున్నారు. దీని గూర్చి అసలు విషయాన్ని ఇచట వేమన చెప్పుచున్నాడు. జంగమ జాతివారు (చరించు వారు) స్థావరములన్ను (చరించని వాటిని) మాత్రమే అనగా చెట్లనుండి వచ్చే ఆకుకూరలు, కాయగూరలు, గడ్డలు మొదలగు వాటిని మాత్రమే తినుచున్నారు. ఇక మిగతా జాతులలో కొందరు మాంసాహారాన్ని, ఇంకొందరు శాఖాహారాన్ని, మరికొందరు రెండింటిని గ్రహిస్తున్నారు. పశువులలో కూడా ఇలానే వున్నవి. విచారించి చూడగా సర్వప్రాణులు అన్నము దొరకనప్పుడో లేక అన్నమును తినకుండా వున్న సమయముననో తమ మాంసాన్ని తామే తినుచున్నారు. అదియునూ గాక చెట్లు కూడా ప్రాణమున్న జీవులే. కనుక ఆహారపు అలవాట్లను బట్టి వారి కులము గొప్పదనో, కురుచదనో చెప్పుట తగదని వేమనయోగి వచించుచున్నాడు.

**ఆ.వె॥ వేసమునకునైన దాసరి గావచ్చు**
**హంగు దప్ప వేళ జంగమవును**
**పదియు వేలకైన బాపడుగారాదు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥ 57**

వేషము వేసుకొని దాసరిగా మారవచ్చును. పరిస్థితులు అనుకూలించనప్పుడు అతడే జంగముగా మారవచ్చును. కాని ఎన్ని విధములైననూ వాడు బ్రాహ్మణుడుగా మారలేడు. ఎందుకనగా బ్రహ్మజ్ఞానము పొందడం చాలా కష్టము. అది సంతలో కొనుక్కొని వేసుకునే వేషములాంటిది కాదని వేమనయోగి వచించుచున్నాడు.

ఆ.వె॥ సకల జాతి పురుష సంఖ్యల కెల్లను
సతుల నివ్వ దాము సమ్మతించ
కొప్పి పుచ్చు గొందురోగులు బాపలు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 58

బ్రాహ్మణ వర్ణము వారు తమ వర్ణపు కన్యలను ఇతర జాతి పురుషులకు ఇచ్చి వివాహము చేయుటకు సమ్మతించరు. కాని ఇతర జాతుల కన్యలను తమ పురుషులకు ఇవ్వ వచ్చినచో వద్దనక ఒప్పుకొని పుచ్చుకుందురు. ఇట్టి బ్రాహ్మణులు ఓగులే కాని యోగులు కాబోరని వేమన చెప్పుచున్నాడు.

ఆ.వె॥ పంచ వర్ణములను పంచ వేదంబుల
నంటి యుంట వినరో యల్పమతులు
పంచ వర్ణములను భావింప శివుడుండు
విశ్వదాభిరామ వినురవేమ॥ 59

'నమశ్శివాయ' యను అయిదు అక్షరములను వీడి పంచవేదములు లేవు. దీనిని అల్ప మతులైన వారు కనలేరు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు, చండాల యను పంచ వర్ణముల మానవులయందు శివుడే (ఆత్మయే) చైతన్య రూపముగా వుండి సర్వ క్రియలను చేయించు చున్నాడని వేమన యోగి ప్రవచించు చున్నాడు.

ఆ.వె॥ పంచముఖములందు పంచ వర్ణములుట్టె
పంచ వర్ణములను ప్రబలె జగతి
పంచముఖుని యెట్లు ప్రస్తుతి సేయరో
విశ్వదాభిరామ వినుర వేమ॥ 60

శివుని (ఆత్మయొక్క) యొక్క అయిదు ముఖాల నుండి అయిదు వర్ణములు (న-మ-శ్శి-వా-య) పుట్టినవి. ఆ అయిదు వర్ణములనుండియే జగత్తు ప్రభవించినది. కనుక అట్టి ఆత్మ తత్త్వమును ఈ మనుష్యులు ఏల తెలుసుకొనజాలరోయని వేమన ప్రశ్నిస్తున్నాడు.

ఆ.వె॥ గురువులను జెరపిన కులమెల్ల నాశమౌ
బ్రాహ్మణులను జెరుప భస్మమౌను
హరి హరులను జెరుప నపవర్గదూరము
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 61



గురువులను నాశన మొందించిన వాని కులమంతయు నాశనమగును. ఎందుకనగా జ్ఞానము బోధించి మార్గ దర్శకత్వము చేయువారుండరు గనుక. ఎవరి నుండి బ్రహ్మజ్ఞానమును గ్రహించాడో, వారికే మోసము చేయ తలపెట్టువాడు భస్మాసురని వలె భస్మమగును.

హరిహరాదుల స్థానాలను ఎరుగక, వారిని నిందించే వారు (వారులేరనే నాస్తికులు) అపవర్గము (మోక్షము) నకు బహు దూరస్తులని వేమనయోగి ప్రవచించుచున్నాడు.

ఆ.వె॥ మంత్రమును దలతురు మంత్రార్థ మెరుగరు
యర్థ మెరుగ నోర తానె ద్విజులు
యర్థమును దెలిసిన యాతడే బ్రహ్మర్షి
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 62

కొందరు మంత్రమును తలుచుచుంటారే గాని దాని అర్థమును తెలియరు. మంత్రార్థమును ఎరుగనివారు ద్విజులు ఎలా కాగలరు? కాని మంత్రము యొక్క అర్థమును తెలిసిన వాడే వర్ణము వాడైననూ బ్రహ్మర్షి యని వేమన నుడువు చున్నాడు.

ఆ.వె॥ వేముకన్న విషము వెర్రి పుచ్చాకురా
పాముకన్న విషము ప్రథమ శాఖి
నాభికన్న విషము నల్లని బాపడు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 63

వేము కన్నా వెర్రి పుచ్చాకు యందు చేదు ఎక్కువ. పాముకన్నా ప్రథమ శాఖ వాడికి చెరుపు చేసే బుద్ధి ఎక్కువ. తమోగుణము (నలుపు) గల బాపడు సమాజాన్ని సర్వధా అభివృద్ధి పథములోకి తీసుకొని పోలేడని వేమన వివరించుచున్నాడు.

ఆ.వె॥ జగములందు వేష జాతులయందిట్లు
ప్రాణ దైవములును ప్రబలియుండు
జాడ దెలియలేరు జంగములందురు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 64

పరమాత్మయే తన మాయ వలన సర్వ లోకములయందు, మరి ఆ లోకములలోని వివిధ వేషధారులగు జాతుల యందు తానే అయ్యివున్నాడు. దీని జాడ తెలుసుకోకనే వివిధ జాతుల వారు తమకు తామే గొప్పని చెప్పుకొనుట తగదని వేమన చెప్పుచున్నాడు.

ఆ.వె॥ బాప డనగ నేమి భక్తుడనగనేమి?
భోగి యనగనేమి త్యాగియేమి
యెన్ని పేరులైన నినసుతులోకంబు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 65

బాపడైనను భక్తుడైనను, భోగియైనను త్యాగియైనను ఇంకా ఎన్ని పేర్లచే పిలువబడినప్పటికి ఆత్మ తత్త్వమును తెలుసుకోనిచో అంత్యకాలమున అందరు కాలుని రాజ్యమును చేరేవారే.

ఆ.వె॥ ఋషుల దెట్టి జాతి యింపుగా వెలసిన
బ్రహ్మ కిష్టులైరి బ్రహ్మలైరి
తుదిని యెవ్వరైన సొద మున్గుటేనయా
విశ్వదాభిరామ వినురవేమ ॥ 66

ఋషులు ఏ జాతికి (కులానికి) చెందినవారు? వీరు సృష్టికర్తయైన బ్రహ్మకు ప్రేమపాత్రులైరి. బ్రహ్మతత్త్వమును గాంచి బ్రహ్మస్వరూపమును పొందిరి. అయిననూ తుదకు వారు మరణించిన తర్వాత కాష్టములో కాలిపోయేవారే. మిగతా జాతుల వారు కూడా అదే గతిని పొందుచున్నారు.

కనుక అన్ని జాతులవారు ఈ విషయంలో సమానమేనని వేమన బోధించుచున్నాడు.

ఆ.వె॥ ఋషి కులమునందు నింపుగా జనియించి
గోత్ర కులముల నటు గొప్పలైరి
బ్రహ్మ సంతు గాదు బ్రాహ్మణు లెట్లైరి
విశ్వదాభిరామ వినుర వేమ॥ 67

కొందరు ఋషి కులములో జన్మించి, ఆ తర్వాత వారు గోత్రకులములలో ఉన్నతులైనారు. కాని వారు బ్రహ్మసంతతి వారు కారు. కనుక బ్రాహ్మణులెట్లైరి? అని వేమన ప్రశ్నించుచున్నాడు.

ఆ.వె॥ మనసు దెగనివాడు మరియును దలపోయ
మాలకంటె దిగుడు మనుజులార
నరక మేగుదెంచు నష్టమా పిమ్మట
విశ్వదాభిరామ వినుర వేమన ॥ 68



బ్రహ్మమునందు మనస్సును లయం చేయనివాడు మాలకంటెను తక్కువే యగును. అట్టి వాడు మరణాంతరము నీచ జన్మలకే వెళ్లునని వేమనయోగి చెప్పుచున్నాడు.

ఆ.వె॥ వర్ణములకు నెల్లవాడు నే గురువని
మరణమెరుగ డట్టి మాలకొడుకు
గురువు తాను జావ గురిలేని కాకిరా
విశ్వదాభిరామ వినుర వేమ॥ 69

అన్ని వర్ణాల వారికి తాను గురువునుకొనువాడు, తన మరణాన్ని తాను తెలుసుకోలేడు. అట్టివాడు మాలవాడే. అట్టి గురువు చనిపోయిన తర్వాత ఏ గురిలేక తిరుగు కాకిగా మారతాడని వేమన చెప్పుచున్నాడు.

ఆ.వె॥ జాతి నీతి వేరె జన్మము లొక్కటి
యరయ తిండి వేరె యాక లొకటి
పశులవన్నె వేరె పాలెల్ల యొక్కటి
విశ్వదాభిరామ వినుర వేమ॥ 70

ప్రపంచములోని జాతులు మరియు వారి నీతులు (నడకలు) వేర్వేరు. అయిననూ అందరి జన్మలు ఒకటే. తిండ్లు వేర్వేరు కాని ఆకలి ఒక్కటే. పశువుల (గోవుల) రంగులు వేర్వేరు, కాని వాటి పాలకు ఒకే రంగు వున్నదని వేమన యోగి ఉదహరించుచున్నాడు.

ఆ.వె॥ శూద్రులందు బుట్టి శూద్రుల దూషించి
ద్విజుల మనెడి పేరు నిజము జేసి
మనసు నిల్ప కున్న మరి శూద్రుడధముండు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 71

శూద్ర జాతియందు పుట్టి, శూద్రజాతిని అసహ్యించుకొని, వేదాంతర్గతమగు కర్మకాండను నేర్చి ద్విజుడైన వాడు తన మనస్సును దానియందు నిల్పనిచోవాడు ఆ శూద్రజాతి కన్న అధముడని వేమన యోగి చెప్పుచున్నాడు.

ఆ.వె॥ మాదిగె చెయివులను మనసులో బెట్టుక
మాదిగెలను దెగడు మాదిగెపుడు
మంచి గుణములేక మరి ద్విజుడెట్లగు?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 72

చెడు తలంపులను తన యందుంచుకొని మాదిగెలను తిట్టెడు వాడే మాదిగ. మంచిగుణము లేక ఎవరైనా ద్విజుడు కాగలడా? కాలేడని భావము.

ఆ.వె॥ **కల్లలాడు కంటె కష్టంబు మరి లేదు**
**కష్టమెపుడు నోలి గలిగియుండు**
**ద్విజుడ ననుట చూడ దిమ్మరి తనమది**
**విశ్వదాభిరామ వినుర వేమ॥** **73**

ఎల్లప్పుడూ కల్లలు, ఆడుట కంటే కష్టము మరేదియూ లేదు. కల్ల వలన కష్టము కష్టము వల్ల కల్ల వరుసగా కలుగుచుండును. నిరతము కల్లలాడు వాడు ద్విజుడనని చెప్పుకొనుట అజ్ఞానమని వేమన చెప్పుచున్నాడు.

ఆ.వె॥ **విప్ర వరులమనుచు వేదంబు చదువుచు**
**ప్రాకృతులను జూచి పరిహసించు**
**ధరణి సురల కన్న దాసరి మతమెచ్చు**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **74**

'వేద పాఠంతు విప్రానాం'. వేదపాఠములను నేర్చిన వాడే విప్రుడు. అట్టివాడు ప్రపంచీకులను జూచి పరిహసించుట తగదు. ఒకవేళ విప్రులు ప్రపంచ వ్యవహారాదులలో మునిగివున్న వారిని హేళన చేసినచో, వారి మతముకన్నా దాసరి మతమే గొప్ప. ఎందుకనగా ఆచారములేని చదువు అనర్థము. దాసరి మతము వేషధారణకు మరియు ఆహార విహారాదులకు విలువనిచ్చును. కనుక వక్రగతిలో సంచరించు విప్రుల పోకడకంటే దాసరిమతమే నయమని వేమన వచించు చున్నాడు.

ఆ.వె॥ **వేషమొనర గట్టి వెలయ శూద్రత్వంబు**
**తనకు లేదనుకొను ధరణి ద్విజుడు**
**అరిది గిట్టు వేళ నడుగు ద్విజత్వంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ॥** **75**

కొందరు శూద్రులు నిజమైన ద్విజులచే ఆకర్షించబడి, వారివలె వేషములను వేసుకొని తమ శూద్రతనము పోయినదనుకొను చున్నారు. అయితే ఆ వేషములను తీసి వేయునపుడు వారి ద్విజత్వము తొలగి పోవుచున్నది కదా! అని వేమన నుడువు చున్నాడు. కనుక వేషములను మార్చుట వలన ప్రయోజనము లేదు, హృదయాలను మార్చుకొనుమని చెప్పుచున్నాడు వేమన యోగి.



ఆ.వె॥ **జాతి మతము విడిచి చని యోగిగా మేలు**
**జాతి తోనె యున్న నీతు లేల?**
**మతము బట్టి జాతి మానకుంట కొరంత?**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **76**

అధిష్ఠాన చేతన బ్రహ్మము యొక్క స్థాన,, స్వరూప, స్వభావములను చక్కగా తెలిసికొనినవారు సర్వజాతులకు, సర్వమతాలకు ఆ బ్రహ్మమే మూలమని తెలుసుకొని దానికి అతీతముగా వుండి లోకమునందు ప్రవర్తించుదురు. అట్టివారే నిజమైన యోగులు.

స్వజాతిని విడువకుండా, దానియందు మమకారముంచుకొని నీతులు చెప్పువారు మాయకు లోబడిన వారే. వివిధ మతాచారాలయందుండి తమ తమ జాతులను మరువజాలనివారు తప్పుచేసిన వారే యగుదురు. వేమన యోగి బోధించిన అచల వేదాంతము వివిధ మతాలకు, జాతులకు అతీతమై వున్నది. కనుకనే జాతిమతాలను నిరసించెనని గమనించదగును.

ఆ.వె॥ **వాక్కు శుద్ధి లేని వాడు చండాలుండు**
**ప్రేమ శుద్ధి లేక పెట్టు టెట్లు**
**నొసలు భక్తుడైన నోరు తోడేలయా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **77**

నిర్భయంగా మనో వాక్కాయములందు ఒకే రీతిన నడువనివాడు ఏ వర్ణము వాడైననూ చండాలుడే. ఒక అతిథికి ప్రేమలేకుండా పంచభక్ష్య పరమాన్నములు పెట్టిననూ నిష్ప్రయోజనమే. అతిథికి అవి విషమే అగును. ప్రేమతో పెట్టిన గంజి అయిననూ అమృతమగును. నొసలు మీద విభూతి, బొట్టు మొదలగునవి పెట్టుకొని, ఒకడు తాను భక్తుడనను కొన్ననూ వాడి నోరు మాత్రం ఆహారం కోసం వెంపర్లాడే తోడేలు లాంటిది. అట్టి భక్తుడు వేషము వేసుకొని కూటికై భ్రమసేవాడే గాని, తత్త్వ జ్ఞానము పొందలేడని వేమనయోగి భావము.

ఆ.వె॥ **కూడదేమి జేసె కులమేమి చేసెను**
**భూమి యేమి జేసె బొంది కట్టె**
**నరుడు బడెడు పాట్లు నగుబాట్లు చూడగా**
**విశ్వదాభిరామ వినుర వేమ ॥** **78**

తాను తినే ఆహారము వల్లగాని, తాను జన్మించిన కులము వల్లగాని, తాను నివసించే ప్రదేశము వల్లగాని, మానవుని శరీరమనే కర్రకు విలువరాదు. కాని మానవుడు సృష్టి రహస్యమును తెలిసికొని త్రికరణ శుద్ధిగా ప్రవర్తించినచో తాను తీసుకొనే ఆహారానికి , తన కులానికి, తను నివసించే ప్రదేశానికి మహిమ చేకూర గలదు. అట్లు గాక కూడుకోసమోగాని, కులము గొప్ప తనము నిలుపుట కోసమోగాని, రాజ్యాలకోసమోగాని పడేపాట్లు నగుబాట్లే అవుతాయని వేమన బోధించుచున్నాడు.

ఆ.వె॥ పూజ కన్న నెంచ బుద్ధి నిదానంబు
మాటకన్న నెంచ మనసు దృఢము
కులము కన్న మిగుల గుణమె ప్రధానంబు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 79

పూజించే భక్తుల చిత్తము కన్నా, మతములవారి బుద్ధి శ్రేష్ఠము. బుద్ధి నిశ్చయము చేసి చెప్పే మతములవారి మాటల కంటే సంకల్పించే మనస్సు గొప్పది. వివిధ కులాలను కల్పించే మనస్సు కంటే సర్వము ఒకే వస్తువుని తెలియ చెప్పే జ్ఞాన గుణమే గొప్పదని వేమన బోధించుచున్నాడు.

ఆ.వె॥ కులము హెచ్చు తగ్గు గొడవలు పని లేదు
సాను జాతమయ్యె సకల కులము
హెచ్చు తగ్గు మాటలెట్లెరుంగగ వచ్చు?
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 80

బ్రహ్మ జ్ఞానమును పొందినవాడికి ఒక కులము ఎక్కువ, వేరొక కులము తక్కువ అను గొడవలతో పనిలేదు. వాడికి అన్ని కులాలు ఒకే బ్రహ్మ పదార్థము నుండి పుట్టినవని తెలిసి వుండును గనుక. బ్రహ్మ జ్ఞానమును పొందని వానికే ఈ గొడవలన్ని అని వేమన యోగి తెలుపుచున్నాడు.

ఆ.వె॥ మాల వాని నంటి మరి నీళ్ల మునిగేరు
మనుజ కర్మ చేత మాలడయ్యె
నేల దెలియలేరొ యీ నర పశువులు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 81



మాలవాడు తాకినచో కొందరు నీళ్లలో మునిగి స్నానాలు చేయుదురు. జన్మత: ఎవరూ మాల కాదు. మనుజుడు తాను చేయు చెడు కర్మల ద్వారా మాల అవుతాడు. కనుక దీనిని తెలిసి కోలేని నరపశువులు నీళ్లలో మునుగుట వ్యర్థమని వేమన యోగి చెప్పు చున్నాడు.

ఆ.వె॥ మాదిగె యన వద్దు మరి గుణమొనరిన
మాది గని వసిష్ఠు మగువ దే డె
మాదిగ గుణమున్న మరి ద్విజుడగునయా
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 82

ఆ.వె॥ తనదు తల్లి లంజ తనయాలు మాదిగె
శ్రీపతికి గురువు వసిష్ఠుడరయ
తపము చేత ద్విజుడు తర్కింప కుల మెట్లు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 83

వసిష్ఠుని తల్లి ఒక వేశ్య (ఊర్వశి). అతని భార్య మాతంగ ముని కుమార్తె అయిన అరుంధతి మాదిగ. అయినను అతడు జగత్పూజ్యుడైన శ్రీరామునికి గురువు కదా! తపస్సుచే (విచారణచే) బ్రహ్మజ్ఞానమును సాధించిన వసిష్ఠుడు బ్రాహ్మణుడేయని చెప్పక తప్పదు. కాని అతని తల్లి దండ్రుల వల్ల బ్రాహ్మణత్వమనే కులము అతనికి సంక్రమించ లేదు కదా! కనుక కులము, కులము అని వాదించుట తగదని వేమన నుడువు చున్నాడు. కనుక బ్రహ్మజ్ఞానమును సాధించిన సాధువు ఒకవేళ మాదిగ కులమందు జనించి వుండినను, అతనిని మాదిగ అనవద్దు. కాని ద్విజుల కులములో ఒకడు పుట్టినను మాట తప్పినచో, అతడు 'మాదిగ' అన బడునని వేమనయోగి బోధించుచున్నాడు.

ఆ.వె॥ మాల వాడయినను మరి యాత్మమీదను
మనసు నిల్పనేని మాలగాడు
మనసు నిల్పకున్న మహి మీద మాలడు
విశ్వదాభిరామ వినుర వేమ ॥ 84

మాల కులమందు జనించినను, ఒక వేళ అతడు ఆత్మయందు మనస్సు నిల్పినచో - అనగా సర్వ సృష్టియు ఆత్మ పదార్థమేనను విషయమును గురువును చేరి వస్తు నిర్ణయ పద్ధతిగా తెలుసు కొన్నచో అతడు మాలగాడు, అతడు బ్రాహ్మణుడే అనబడును. కాని ఈ విధానము

తెలుసుకొనక మనస్సు ఏ విధంగా చెపితే ఆ విధంగా అజ్ఞాన పద్ధతిలో తిరుగువాడు ఏ వర్ణమునకు చెందిననూ మాలవాడే కదా! అని వేమన నుడువు చున్నాడు.

ఆ.వె.॥ కులములో నొకండు గుణవంతుడుండెనా
కులము వెలయు వాని గుణము చేత
వెలయ వనములోన మలయజంబున్నట్లు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 85

ఏ విధంగానైతే అడవిలో ఒక గంధపుచెట్టు వుంటే ఆ అడవి అంతా సువాసన మయమవుతుందో, అదే విధంగా ఏదైనా ఒక కులములో ఒక గుణవంతుడు వున్నచో, వాని యొక్క మంచి ప్రభావముతో ఆ కులమునంతటికి మంచి పేరు ప్రతిష్ఠలు కలుగును. కనుక మానవునిలోని గుణమే గొప్పదిగాని, జన్మతః సిద్ధించే కులము గొప్పదిగాదని చెప్పుచున్నాడు వేమన.

ఆ.వె.॥ జాతి వేరు లేక జన్మక్రమంబున
నెమ్మదిని యభవుని నిల్పెనేని
యఖిల జనులకెల్ల నాతడు ఘనుడయా
విశ్వదాభిరామ వినుర వేమ॥ 86

సద్గురువును చేరి వివిధ జాతులయందు భేదభావమును విడిచి, తన జన్మక్రమమును అనగా తాను ఏ విధంగా ఆత్మనుండి, ఆకాశములోకి, ఆకాశమునుండి వాయువులోకి, వాయువునుండి జలములోకి, జలము నుండి పృథ్విలోకి, పృథ్వినుండి చెట్లలోకి, చెట్లనుండి అన్నములోకి, అన్నము నుండి ఈ శరీరములోకి వచ్చినది తెలుసుకొని క్రమముగా నెమనెమ్మదిగా తత్వవిచారణ చేయుచు ఊర్ధ్వదిశ ప్రయాణించుచు చివరకు అభవుని (శివుని) అనగా ఆత్మయందు నిలువవలెను. అట్టివాడే సకల జనులలో ఘనుడని వేమనార్యుడు నుడువుచున్నాడు.

ఆ.వె॥ కొంకణంబు బోవ కుక్క సింహము గాదు
కాశిబోవ పంది గజముగాదు
వేరె జాతివాడు విప్రుడు గాడయా
విశ్వదాభిరామ వినుర వేమ॥ 87

కొంకణమనే ప్రదేశమునకు పోయినచో కుక్క ఎలా అయితే సింహము కాదో, కాశియను పుణ్యక్షేత్రమునకు వెళ్లినచో పంది ఎలా అయితే ఏనుగు కాదో, అలానే వేరే జాతి వాడు విప్రుడు



కాడని వేమన నుడువుచున్నాడు. ఇచట గూఢార్థమేమిటనగా - మానవుడై ఏ వర్ణము నందు జన్మించినను, అతడి పూర్వ జన్మ కర్మానుసారము అతనికి ఏదో ఒక జాతి లక్షణము సిద్ధించియే వుండును. కనుక అతడిని మార్చడం దుస్సాధ్యము. కనుక ఎవనికైతే వేదపాఠముల యందు శ్రద్ధవుండునో వాడే విప్రుడు కాగలడు గానీ, ఇతర విషయములయందు ఆసక్తి వున్నవాడు కాలేడని వేమన వచించుచున్నాడు.

ఆ.వె.॥ పూస పోగులైన పుట్టంబు విడియంబు
కాయపుష్టి మిగుల గలగియున్న
హీన జాతినైననిందురమ్మందురు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 88

ఆ.వె॥ మాసిన తలతోడ మలిన వస్త్రము తోడ
యొడల జిడ్డుతోడ నుండెనేని
యగ్ర జన్ముడైన నట్టె పొమ్మందురు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 89

మంచి శరీర పుష్టి కలిగి వుండి పూసపోగులతో (బంగారు ఆభరణాలతో) శుభ్ర వస్త్రములతో అలంకరించుకొని వున్నవాడు హీన జాతి వాడైననూ తమ వద్దకు 'రండని' ప్రతి ఒక్కరు ఆహ్వానింతురు. కాని మాసిన తలతో మలిన వస్త్రముతో, శరీరముపై జిడ్డుతో నున్నవాడు అగ్రజాతివాడైననూ పో, పోయని దూరము వెళ్ళగొట్టుదురు కదా! లోకులు. కనుక విచారించి చూడగా అశుభ్రంగా వుండువారే హీన జాతివారని, శుభ్రంగా వుండువారే అగ్రజాతి వారని చెప్పుకొనుచున్నారు లోకులని, లోకుల అభిప్రాయాన్ని వెలిబుచ్చుచున్నాడు వేమనయోగి.

ఆ.వె. మాల మాల గాడు మహి మీద నే ప్రొద్దు
మాట తిరుగువాడు మాలగాక
వాని మాలయన్న వాడెపో పెనుమాల
విశ్వదాభిరామ వినుర వేమ॥ 90

మాల జాతియందు పుట్టినవాడిని ఏ సమయంలోను 'మాల'యని అనకూడదు. కాని ఇచ్చిన మాట తప్పువాడే మాల. కాని వాని మాల యన్నవాడే పెనుమాల యని వేమన పేర్కొనుచున్నాడు.

ఆ.వె॥ పాలు పెరుగు వెన్న పాయసాన్నము నెయ్యి
జున్ను నెన్నియైన జూడపాలు
పాల వంటి కులము బ్రహ్మంబుగానరో
విశ్వదాభిరామ వినుర వేమ॥ 91

విచారించి చూడగా పెరుగు, వెన్న, పాయసాన్నము, నెయ్యి, జున్ను ఇవన్నియు పాలయొక్క మారు రూపములే. అదే విధంగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర మొదలగు సర్వజాతులు బ్రహ్మము యొక్క పరిణామములే. కనుక బ్రహ్మము యొక్క కులము పాలవంటిదని వేమన ఉపమానము నిచ్చుచున్నాడు. కనుక సర్వ జాతులు బ్రహ్మము (ఆత్మ) యొక్క స్వరూపములేనని వేమన తేట పరచుచున్నాడు.

ఆ.వె॥ జాతులందు నెట్టి జాతి ముఖ్యముజూడ
యెరుక లేక దిరుగ నేమిగలదు
యెరుక గలుగు మనుజుడేజాతి గలవాడు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 92

అన్ని జాతులలో ఏ జాతి గొప్పది? అంటే వేమన 'ఎరుక కలుగువాడె హెచ్చైన కులజుండు' అని సమాధానమిచ్చాడు. అనగా - సృష్టి యంతటికి మూలకారణమైన ఆత్మను (ఎరుకను) తెలిసికొని, దాని యందు సమిష్టి పద్ధతిలో నడచుకొనువాడే ఎక్కువ జాతివాడని అర్థము. కాని ఎరుక తత్త్వమును ఎరుగక తిరుగువాడు నరక కూపమందే పడుచుండునని వేమన నుడువుచున్నాడు.

ఆ.వె॥ దర్శనంబులందు ధర షణ్మతములందు
వర్ణకాశ్రమముల వదలకెపుడు
తిరుగుచుండు వాడు ధరలోన నంధుండు
విశ్వదాభిరామ వినుర వేమ॥ 93

కణాదుడు, అక్షపాదుడు, వ్యాసుడు, కపిలుడు, పతంజలి, జైమిని అను ఆరుగురి ఉపజ్ఞములగు వైశేషిక, న్యాయ, వేదాంత, సాంఖ్య, యోగ, మీమాంసలు అను షడ్దర్శనములు, వైష్ణవము, శైవము, శాక్తము, గాణాపత్యము, సౌరము, కాపాలము అను షణ్మతములు; బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అను నాలుగు వర్ణములు, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస మనబడు నాలుగు ఆశ్రమములు మొదలగు వాటిని విడువకుండా తిరుగువాడు అజ్ఞానుడే. ఎందుకనగా



వీటి వలన పరబ్రహ్మము తెలియబడదు. అందుచే పైన చెప్పబడిన అన్నింటికి అతీతమైన అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము ఒక్క అచల గురునిచే మాత్రమే తెలిసికొన వీలున్నదని గుర్తించి వారిని వెదకి చేరుకొని, సేవించి, పూజించి, బోధ క్రమమును విని, వస్తు నిశ్చయ పూర్వకముగా సకల సృష్టికి మూలమైన ఎరుక (బ్రహ్మము)ను ఎరిగి, అదే అన్ని మాయలకు పుట్టినిల్లని కని, దానిని విడిచి లోకమున అంటీయంటక కలియువాడే ధన్యుడని వేమనయోగి సిద్ధాంత నిర్ణయం.

ఆ.వె॥ ఉర్వి వారికెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలయ జేసి
తలను చెయ్యి బెట్టి తగ నమ్మ జెప్పరా
విశ్వదాభిరామ వినుర వేమ॥ 94

శరణాగతులై వచ్చిన వేలకొలది శిష్యులకు వారి శిరములపై కరముంచి దీవించి సృష్టి విధానమును ఎరుకజేసి, వారి మధ్య వున్న కుల, మత, జాతి, వర్గ, వర్ణ విభేదాలను తొలగించి సఖ్యతను చేకూర్చి, ఒకే కంచములో వండిన అన్నమును హెచ్చుతగ్గులు లేకుండా వారందరికి వడ్డించిన మహానుభావుడు, మహాయోగి వేమన. ఆ సాంప్రదాయమునే కొనసాగించుమని శిష్యులకు చెప్పుచున్నాడు వేమన యోగీంద్రుడు.

## ముగింపు :

బ్రాహ్మణ కులంలో పుట్టి తత్త్వశాస్త్రంలో దిట్ట అని పేరొందిన శ్రీ శంకరాస్వాముల వారు "ఎనిమిదవ ఏట చతుర్వేది. పన్నెండవ ఏట సర్వశాస్త్రవేత్త. 16 వ ఏట భాష్యకర్త. 32వ ఏట పరమపదించిరి". వారు కూడా చివరకు వర్ణ వ్యవస్థ ఉచ్చులో చిక్కుకొని చండాలున్ని "దూరం గచ్ఛ, దూరం గచ్ఛ" అని నిందించడం జరిగింది. అపుడు అచల సిద్ధాంతుడైన చండాలుడు అడిగిన ప్రశ్నల వల్ల కనువిప్పు కలిగిన శంకరాస్వామి అతని పాదాలపై పడినాడు. వర్ణములు వ్యక్తుల యొక్క గుణ కర్మల వల్ల సిద్ధిస్థాయి తప్ప వంశపరంపరంగా కావు. జన్మతః శాస్త్రి కొడుకు శాస్త్రి కాజాలడు, మాలవాని కొడుకు మాలకాదు. ఆ యా వర్ణాలు వారి వారి గుణకర్మల వల్లనే వస్తాయి. కాని కొన్ని వేల సంవత్సరాలుగా బ్రాహ్మణులమని చెప్పుకొనువారు వర్ణ వ్యవస్థ యొక్క అసలు రంగు మరుగుపరచి మిగతా వర్ణాల వారిని తమ ఆధీనంలో వుండేటట్లు శాస్త్ర మర్యాదలను ఏర్పరచుకొన్నారు. కాని సత్యమును చాటి చెప్పలేదు. ఈ గ్రంథమునందు ఒక వర్ణము వారిని మెప్పించుటకొరకుగాని, వేరొక వర్ణము వారిని నొప్పించుట కొరకు గాని, ఇంకొక వర్ణము వారిని ఒప్పించుటకొరకుగాని ప్రయత్నము జరుగలేదు. కేవలము అచల పరిపూర్ణ రాజయోగ యోగ సిద్ధాంతానుసారముగా వేమన పద్యాలతో వర్ణ వ్యవస్థ యొక్క అసలు గుట్టు రట్టు చేయబడినదని గమనించినచో ఈ గ్రంథ లక్ష్యము నెరవేరినట్టే.

**జై సద్గురు ప్రభుమహరాజుకీ జై**

సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు

